EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: ***SHAPE SHIFTER***- GREEN APPLE, ***SPEED***-MANGO, ***FLIGHT***-ORANGE, ***GIANT***-WATERMELON, ***STRENGTH***- RASPBERRY, ***SHRINK***-LYCHEE, ***INVISIBLE***-PINEAPPLE, ***STRETCH***-MUSK MELON, ***FISSION***-BLACK CURRANT, ***FORCE FIELD***-GUAVA.

***RECAP:*** RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOGAARR, WHEN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE ***DEKATRIX, A POWERFUL GADGET*** WITH 10 ***POWERS.***




జరిగిన కథ: డా.మీన్ డెకాట్రిక్స్‌ను రామ్ మరియు శ్యామ్ నుండి దొంగిలించి నగరాన్ని నాశనం చేయదలచాడు.. ..ఈలోగా ఒక కొత్త అమ్మాయి ఏంజిల్ అన్న పేరుతో రామ్ మరియు శ్యామ్‌ని కలిసింది.

కొనసాగింపు...



























# యువ విజేతలు

## అర్హతా మగావి

అర్హతా మగావి బెంగళూరుకు చెందిన 16 ఏళ్ల స్విమ్మర్. ఏడేళ్ల వయసులో ఈమె ఈతలో శిక్షణ ప్రారంభించింది. ప్రతిరోజూ అయిదారు గంటల పాటు ఈత అభ్యసిస్తూ వచ్చింది.

చదువు, క్రీడలు రెండింటికీ ఈమె ప్రాధాన్యత ఇస్తోంది. అయితే ఒక ముఖ్యమైన ఈత పోటీ కోసం ఆమె తరగతులకు హాజరు కాలేకపోయింది. అలాగే ఫైనల్ పరీక్షల సమయంలో టోర్నమెంట్‌లో పాల్గొనాలని ఎంచుకుంది. తన పాఠశాల మరియు కుటుంబం అందిస్తున్న తోడ్పాటుకు ఆమె మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు తెలిపింది.

ఈతలో బటర్‌ఫ్లై ఈవెంట్ ఈమె అభిమాన క్రీడ. ఆసియన్ యూత్ గేమ్స్ (2009) అర్హతకు ఛాలెంజింగ్ టోర్నీ అట. విదేశీ ఈత క్రీడాకారిణుల శరీర దార్ఢ్యత చూసి తాను భయపడిపోయానని ఆమె చెబుతుంది. క్రీడలను అభిమానించే పిల్లలకు ఆమె ఇచ్చే సందేశం ఒకటే. "జీవితానికి సంబంధించిన నైపుణ్యాలను నేర్చుకోవడానికి క్రీడలు గొప్ప మార్గం. కాబట్టి క్రీడా రంగానికి వెళ్లి ఏదో ఒక ఆటను ఆస్వాదించండి!"

ఈ నెల ఉదయ తారకు చందమామ శుభాకాంక్షలు.




**ట్రివియా:**

- అర్హతా మగావి 2010 జూన్ వరకు 400 పైగా పతకాలు సాధించింది!

**ముఖ్యమైన విజయాలు:**

- అమృత్‌సర్‌లో 2008లో జరిగిన 35వ జూనియర్ జాతీయ అక్వాటిక్ ఛాంపియన్‌షిప్‌లో 7 స్వర్ణ, 1 రజిత పతకాలు మరియు 4 జాతీయ రికార్డులు సాధించింది. బెస్ట్ స్విమ్మర్ గర్ల్స్ గ్రూప్ 2 పోటీల్లో టైటిల్ విజేత.
- తిరువనంతపురంలో 2009లో జరిగిన 63వ సీనియర్ జాతీయ అక్వాటిక్ ఛాంపియన్‌షిప్ పోటీల్లో 6 స్వర్ణ, 2 రజిత పతకాలు మరియు 2 జాతీయ రికార్డులను సాధించింది.

# ఈ సంచికలో...



చందమామ సంపుటి: 64 జనవరి 2011 సంచిక: 01













**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.

ప్రియమిత్రులారా!!!

మీ అందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు! మనం కొత్త సంవత్సరం తలుపులు తడుతున్నాము. దాంతో పాటు కొత్త తీర్మానాలు, ఆశలు, ఆసక్తులు వెన్నంటి వస్తాయని అర్థం. కొత్త సంవత్సరంలో మనం కొన్ని లక్ష్యాలను ఎంచుకుని వాటిని పూర్తి చేయడానికి ప్రయత్నిద్దాము. అలాగే మాకు కూడా ఒక ఆకాంక్ష ఉంది. పిల్లలకు సార్వత్రిక విద్యను అందించే కృషిని మా పాఠకులు చేపడతారని, చేపట్టాలని కోరుకుంటున్నాము. ఈ దేశంలోని పిల్లలందరినీ చదువుకునేలా చేయడానికి సంబంధించి మా పాఠకులు విభిన్న ఆలోచనలను, పథకాలను అందించాలని మేం కోరుతున్నాము.

జనవరి 26 గణతంత్ర దినోత్సవం. ఈ రోజే మన దేశం రాజ్యాంగాన్ని రూపొందించుకుని సార్వభౌమాధికార ప్రజాతంత్ర దేశంగా మారింది. మనం ఒక దేశంగా ప్రతి రోజూ మారుతున్న పరిణామాల మధ్యే రూపొందుతూ వస్తున్నాము. పౌరులందరి ప్రాథమిక హక్కులను కాపాడేందుకోసం మన రాజ్యాంగం కూడా ఈ మార్పులను స్వీకరించవలసి ఉంటుంది.

జనవరి 14న మనం మకర సంక్రాంతిని జరుపుకుంటాము, దేశంలోని పలు ప్రాంతాల్లో పతంగాలను ఎగురవేసి ప్రజలు ఈ పండుగను జరుపుకుంటారు. ఇక దక్షిణాన మనం సంక్రాంతిని అంటే పంటల పండుగను వైభవంగా జరుపుకుంటాము. ఈ నెలలోనే మనం వసంత పంచమిని జరుపుకుంటాము. ఈ సందర్భంగా జ్ఞాన, సంగీత, కళాదేవత సరస్వతికి పూజలు చేస్తాము.

ప్రియ పాఠకుల అభ్యర్థన కారణంగా జనవరి సంచిక నుంచి చందమామ పాత సైజులోనే ముద్రించబడుతోంది. ఇది చందమామ అభిమానులందరికీ సంతోషం కలిగిస్తుందని భావిస్తున్నాము.

చందమామ పత్రికలోని వివిధ విభాగాల పట్ల మీ స్పందనలు మాకు ప్రోత్సాహాన్ని ఇస్తాయి. మీ స్పందనలను, అభిప్రాయాలను పంపడం కొనసాగించాలని అభ్యర్థిస్తున్నాము. మరింత మెరుగుదలను సాధించడానికి ఇది మాకెంతో తోడ్పడుతుంది.

మంచి భవిష్యత్తుకోసం మనందరం మారెదము గాక! – సంపాదకులు




జనవరి 2011 Rs. 20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :** Prashant Sharad Mulekar
**Associate Editors :** R. Vaasugi, K. Raja Sekhara Raju
**Sub Editor :** Patricia Pandian
**Content Head - Online :** Sowmya Bharadwaj
**Senior Artists:** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar
**Artist :** Venki
**Layout Designers :** B. Thirumal, K. Narendra, N. Sivakumar
**Production In-charge :** Prashant Pawar
**Circulation:** circulation@chandamama.com
**Head - Sales and Circulation:** Sanjay B Thorat
**Manager - Sales & Circulation (West & North):** Vinay K Brid
**Asst. Manager - Sales & Circulation (East):** Subhankar Rej
**Sales Officer - Circulation:** K. Ravishankar
**Advertisement :** sales@chandamama.com
**Subscription:** Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828
**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093. Printed At :- Shruti Art Pvt. Ltd. Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai-400010. Editor :- Prashant Sharad Mulekar


# పాఠకుల లేఖలు

చందమామకు, బాలవాణికి కృతజ్ఞతలు. మా ప్రాంతంలో పలు సౌకర్యాలు ఉన్నప్పటికీ, మురికికాలువల్ల, జనం దోమకాటుతో బాధపడుతున్నారు. ఈ మధ్య మా ఎంఎల్ఎ గారు మా వీధికి రాగా మేం పదిమంది బాల విలేకరులం చేరి మాకు మురికి కాలువలొద్దు తాగు నీరు కావాలి అని డిమాండ్ చేశాము. ఆయన వెంటనే స్పందించి సమస్య పరిష్కారానికి అక్కడికక్కడే ఆదేశాలు జారీ చేశారు. – ఓగిరాల అనిరుధ్ కృష్ణ, నెల్లూరు

చందమామ సైజు మరీ చంపక్‌లా తగ్గిపోయింది. కాలాను గుణంగా మారవచ్చు కాని అది సైజు రీత్యా కాదు. సంచిక నెలలో 20 రోజులు ఆలస్యంగా వస్తూ క్విజ్ వంటి వాటి సమాధానాలను 25వ తేదీ లోపు పంపవలెనని చెప్పడం భావ్యమా? చందమామ వార్షిక సంచిక తెలుగులో ఉంటుందా? – శివలెంక చంద్రశేఖర్, హైదరాబాద్

చందమామ చిన్నబోవడమే కాదు అక్షరాలు, పదాలు కూడా దగ్గరయిపోయి. చదవడానికి ఇబ్బందిగా ఉంది. అలాగే శీర్షిక, రచయితల పేర్లు, వెనుక వేసే రంగుల్లో కలిసి పోయి కనబడటం లేదు. దీంతో పుటల సంఖ్య కూడా కనబడడం లేదు. – వల్లభజోస్యుల పద్మబ్రహ్మశాస్త్రి, ఎపి

పత్రికలో కథల కంటే, ఆకర్షించని శీర్షికలు పెరుగుతూ వస్తున్నాయి. ఆగస్టు సంచిక నుండీ ఆకారంలో కూడా మార్పు వచ్చింది. ఇంతకీ చందమామ ప్రయాణం ఎటువైపు? – డి.ఎస్. శంకర్, వక్కలంక

చందమామ వార్షిక సంచిక ప్రస్తుతానికి ఇంగ్లీషులోనే ప్రచురితమవుతోంది. ఈ జనవరి నుంచే చందమామ పాత సైజులోనే వస్తోంది, రచయితల పేర్లు, రంగుల సమస్యను పరిష్కరించాము. అతి త్వరలోనే చందమామ సకాలంలో మీ ముందుకు రాబోతుంది. – సంపాదకులు

feedback@chandamama.com

**Visit us at : http://telugu.chandamama.com**

# BSA LADYBIRD

Your best friend for life.

Shine



## Get used to the tantalizing taste of freedom.

There's no greater feeling than having the wind in your hair, the open road beneath your feet. With a ladybird, freedom is yours. So make the most of it and enjoy every moment!



www.ticyclesindia.com

**Avail the loyalty bonus!**

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions)**



**Chandamama!**

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
**Go to www.chandamama.com & subscribe Now!!**



**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..........................................................................................

Date of Birth: ................................. Sex :.......................................

Address: ..........................................................................................

..........................................................................................

..........................................................................................

...................................................... City: ..........................................

State:...................................... Pin:..............................................

Telephone:..........................................................................................

Mobile:..........................................................................................

Email:..........................................................................................

Subscription Number (for renewals):...........................................

Gift Subscription to the following address:

..........................................................................................

..........................................................................................

..........................................................................................

..........................................................................................

Enclosed Cheque/DD* for Rupees...........................................

Cheque/DD No ..........................................................................

favouring Chandamama India Ltd on.......................................

..........................................................................bank.

Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# తెలివితేటలు

గణపవరం గ్రామంలో వీరదాసు అనేవాడికి తెలివితేటలు ఎక్కువని గట్టినమ్మకం. అందరి దగ్గరా తన తెలివితేటలు ప్రదర్శించే ప్రయత్నం చేసేవాడు. అది అందరికీ ఇబ్బంది కరంగా ఉండేది. అందుకే వాడు ఎదురైతే పక్కకు తప్పుకునేవారు.

ఆ ఊరి జమీందారు తెలివితేటలపోటీ పెడుతున్నట్లు చాటింపు వేయించాడు. అందరిలోకి తెలివిగలవాడికి మంచి బహుమతి ఇస్తారని తెలిసి వీరదాసు ఉత్సాహంగా పాల్గొన్నాడు.

వారంరోజులు గడిచాయి. జమీందారు తెలివితేటలు గలవారి జాబితా తయారు చేసినట్లుగా వీరదాసుకు తెలిసింది. వెంటనే జమీందారు ఇంటికి పోయి గోడకు తగిలించిన జాబితా చూసాడు. అందులో అతని పేరు మొదటి స్థానంలో ఉంది. ఆనందంతో వెళ్లి జమీందారును కలిసాడు.

వీరదాసును చూసిన జమీందారు ''ఏమిటిలా వచ్చావు?'' అని అడిగాడు. ''అయ్యా! జాబితాలో నా పేరు మొదట ఉంది. బహుమతి అందుకుందామని వచ్చాను.'' అని చెప్పాడు వీరదాసు.

''జాబితాలో ఏముందో కూడా చూడని నీవేం తెలివైనవాడివి? ముందు బయటకు నడు,'' అని చికాకు పడ్డాడు జమీందారు. బిత్తర పోయిన వీరదాసు బయటకు వచ్చి జాబితా మరోసారి చూశాడు. అది బుర్రలేని వారి జాబితా అని అర్థం చేసుకున్న వీరదాసు, అందులో మొదటి స్థానంలో ఉన్న తను అందరిలోకి తెలివితక్కువ వాడినని అర్థం చేసుకున్నాడు.

వీరదాసు మరెన్నడూ ఎదుటి వారి దగ్గర తన తెలివితేటలు ప్రదర్శించే ప్రయత్నం చేయలేదు.

– ఎన్ శివనాగేశ్వరరావు



# జ్ఞాన దీపం

కోశలపురానికి రాజు కాంతివర్మ. అతను తన ప్రజలందరూ అక్షరాస్యులు కావాలనీ, ప్రతి ఒక్కరూ చదువుకోవాలని మంత్రుల సహాయంతో ఒక నూతన విద్యా విధానాన్ని తయారు చేశాడు. అది అమలు చేయడానికి సమర్థులైన వారిని ఎంపిక చేసే ప్రయత్నం మొదలయ్యింది. అందులో ముగ్గురు మేధావులు అన్నిటా సమ ఉజ్జీలుగా నిలిచారు.

ముగ్గురిలో ఎవరు విద్యాధికారి పదవికి అర్హులో నిర్ణయించమని రాజు మహామంత్రిని ఆదేశించాడు. మహామంత్రి ముగ్గురు మేధావులనీ ప్రశ్నించి, పరిశీలించిన మీదట ఒక నిర్ణయానికి వచ్చాడు. వారి ముగ్గురికీ ఒక్కో వస్తువు ఇచ్చి రాజు వద్దకు పంపాడు.

ముగ్గురు మేధావులలో ఒకరి చేతిలో ప్రమిద, ఒకరి చేతిలో వత్తి, మరొకరి చేతిలో అగ్గిపుల్ల ఉన్నాయి. ముగ్గురు మేధావులూ, రాజు గారికి నమస్కరించి, ''మహారాజా, జ్ఞాన దీపం వెలిగించడానికి సిద్ధంగా ఉన్నాము. దీపానికి నూనె కావాలి.'' అని విన్నవించుకున్నారు.

రాజుగారు మేధావులు ముగ్గురినీ ఉద్దేశించి, ''మీ విద్యా వినయ సంపదలు మాకు నచ్చాయి. మీరు ఎవరికి వారే గొప్ప వారైనా, మీరు ముగ్గురూ కలిసి పని చేస్తే ప్రయోజనం ఉంటుందని అర్థం చేసుకుని సిద్ధమయ్యారు. నూతన విద్యా విధానం అమలు కావడానికి కావలసిన నిధులను మేము సమకూరుస్తాము.

ప్రమిదలో నూనె పోసి, వత్తి వేసి, అగ్గిపుల్లతో వెలిగించినట్లే, మీ మేధాసంపత్తికి మా నిధులు తోడై కోశల పుర ప్రజలకు జ్ఞానదీపాన్ని అందించాలని మహామంత్రి గారి ఆలోచన అనుకుంటాను,'' అని మహామంత్రి వైపు తిరిగాడు. మహామంత్రి తృప్తిగా తలాడించాడు.

సభికులు కరతాళధ్వనులతో ఆ నిర్ణయాన్ని ఆమోదించారు. – గోదావరి లలిత



## బేతాళ కథలు

# పేదవాడి వంశం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా! నీవెవరయిందీ, ఎందుకు ఇంత శ్రమ పడుతున్నదీ నాకు తెలియదు గానీ. కొందరు తాము ఎవరో తెలియకనే అనామకంగా బ్రతికేస్తుంటారు. అందుకు నిదర్శనంగా నీకు మాధవుడి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను.'' అంటూ ఇలా చెప్పసాగాడు:

హేలాపురి అంతగా అభివృద్ధి చెందని చిన్న పట్టణం. ఆ ఊళ్ళో మాధవుడనే వాడుండేవాడు. మాధవుడికి తల్లిదండ్రులుగానీ, తోబుట్టువులుగానీ ఎవరూ లేరు. చిన్నప్పటి నుండీ ఎవరి ఆలనా, పాలనా లేక మాధవుడు గాలికి పెరిగి పెద్దవాడయ్యాడు.

చదువుసంధ్యలు లేకపోవడంతో మాధవుడికి ఎక్కడా నౌకరీ దొరకలేదు. చిన్న



చిన్న కూలిపనులు చేసి పొట్టనింపుకునేవాడు. కొంత కాలం గడిచేసరికి ఇలా కూలి పనులు చేసి కడుపు నింపుకోవడం మాధవుడికి విసుగు పుట్టించింది. ఎక్కువ శ్రమ పడకుండా తెలివితో డబ్బు సంపాదించడానికి వాడొక ఆలోచన చేశాడు.

హేలాపురికి ఉత్తరదిశగా రెండు మైళ్ళ దూరంలో పాడుపడిన కోట ఒకటి ఉంది. వంద సంవత్సరాల క్రితం విఠలాపుర చక్రవర్తితో జరిగిన యుద్ధంలో సింగభూపతి మహారాజు మరణించడంతో ఆ రాజవంశం చిన్నాభిన్నమైపోయి కోట శిథిలమైపోయింది. హేలాపురికి వచ్చిన ప్రతీవారూ – పెద్దపెద్ద బురుజులతో, అందమైన భవనాలతో, ఉద్యానవనాలతో అలరారిన ఆ కోటను దర్శించి గతవైభవాన్ని జ్ఞాపకం చేసుకోకుండా తిరిగి వెళ్ళేవారు కాదు. కాలక్రమంలో ఆ కోట ఒక యాత్రాస్థలమైపోయింది.

కేవలం పాడుపడిపోయిన ఆ కోటను చూసి ఆనందించడమే కాకుండా ఆ కోటకు సంబంధించిన చరిత్రను గురించి కూడా తెలుసుకోవాలని యాత్రికులు కుతూహలపడేవారు.

ఈ సంగతి గ్రహించిన మాధవుడు పట్టణంలోని పెద్దల నుండి ఆ కోటకు సంబంధించిన వివరాలు తెలుసుకుని కోటను చూడవచ్చిన యాత్రికులకు ఆ వివరాలన్నీ వివరించి చెప్పేవాడు. ఆ యాత్రికులు మాధవుడికి తృణమో, ఫణమో ముట్టచెప్పేవారు. దాంతో మాధవుడు హాయిగా కాలం వెళ్ళబుచ్చేవాడు.

ఆ తరువాత మాధవుడు మరొక ఆలోచన చేశాడు. అప్పటి నుండి, అతను ఆ కోటను గురించిన వివరాలు యాత్రికులకు తెలియజేస్తూ తాను ఆ రాజవంశస్థుడినేనని చెప్పుకునేవాడు. తమ వంశం నాశనమైపోవడంతో ఈనాడు తనకీ దుర్గతి పట్టిందని ఎంతో విచారిస్తూ చెప్పేవాడు. ఈ సంగతి విని ఆశ్చర్యపోయిన యాత్రికులు అటువంటి గొప్ప రాజవంశంలో జన్మించిన మాధవుడు ఇలా పేదవాడిగా జీవిస్తున్నందుకు విచారం వ్యక్తపరిచి తాము అనుకున్నదానికంటే ఎక్కువ మొత్తం ముట్టజెప్పేవారు జాలితో. ఈ పద్ధతిలో ఎక్కువ ధనం గిట్టుబాటు కావడంతో మాధవుడు కోటను చూడవచ్చిన

యాత్రికులందరికీ ఈ విధంగానే చెప్పి వారి సానుభూతి పొంది ఎక్కువ ధనం సంపాదిస్తుండేవాడు.

ఒకనాడు ఇలాగే కోటను చూడవచ్చిన యాత్రికులకు మాధవుడు కోటను చూపించి వివరిస్తూ సింగభూపతి తన ముత్తాత అని చెబుతూ ఆ కోటలో ఎవరెవరు ఏ ఏ భవనాల్లో నివశించేవారో వివరించి చెబుతున్నాడు. అటువంటి వంశంలో జన్మించిన తన జన్మ ధన్యమైందని పరవశంతో చెప్పుకుపోతున్నాడు మాధవుడు.

ఉన్నట్టుండి ఆ యాత్రికులలో ఒక నడివయసు వ్యక్తి మాధవుడినుద్దేశించి, ''ఒరేయ్.. మాధవా! ఎవరి దగ్గర రా.. నీ కోతలు? నువ్వు సింగభూపతి వంశస్థుడివా? నీది రాజ వంశమా? హేలాపురిలో నీ బతుకేమిటో నువ్వేలా అందరి దయాదాక్షిణ్యాల మీద పెరిగావో నాకు తెలియదనుకున్నావా!'' అంటూ మాధవుడి గురించి తనకు తెలిసిన విషయాలన్నీ మిగతా యాత్రికులకు చెప్పేశాడు. గతంలో వ్యాపారం కోసం హేలాపురిని వదిలి మరో నగరానికి వెళ్ళిపోయిన ఆ వ్యక్తికి మాధవుడి బాల్యమంతా ఎలా గడిచిందో బాగా తెలుసు.

మాయమాటలు చెప్పి తమను మోసం చేయజూసిన మాధవుడి మీద ఆ యాత్రికులకు కోపం వచ్చింది. వాళ్ళు మాధవుడికి చివాట్లు పెట్టి డబ్బులేమీ ఇవ్వకుండా ముందుకు సాగిపోయారు.

మాధవుడికి పదిమందిలో అవమానమయింది. అటు తరువాత కోటను దర్శించ వచ్చే యాత్రికులకు కోటకు, మహారాజు సింగభూపతికి సంబంధించిన





వివరాలే చెప్పేవాడు తప్పితే తాను ఆ రాజ వంశస్థుడననే అబద్ధం మాత్రం చెప్పడం మానేశాడు మాధవుడు.

కొంత కాలం గడిచింది.

ఒకనాడు యాత్రికులతోపాటు ఒక శతాధిక వృద్ధుడు కూడా కోటను చూడడానికి వచ్చాడు. తెల్లగా ముగ్గుబుట్టలా పండిపోయిన జుత్తుతో చురుగ్గా చూసే కళ్ళతో ఏదో వింత తేజస్సు కనబడుతోంది ఆయన ముహంలో.

మాధవుడు యాత్రికులకు కోటను గురించి వివరిస్తూ చెబుతున్నాడు.

ఆ వృద్ధుడు మాధవుడి ముఖంలోకి పరిశీలనగా చూస్తున్నాడు. అందరికీ కోటను గురించి వివరించిన తరువాత ఆ వృద్ధుడు మాధవుడిని చాటుకు తీసుకుని వెళ్ళి, ''బాబూ! నీ పేరు మాధవుడే కదూ!'' అని అడిగాడు. అవునని సమాధానమిచ్చాడు మాధవుడు.-

''అయితే కుడి భుజం వెనుకనున్న నల్లటి మచ్చ నాకొకసారి చూపించు బాబూ,'' అన్నాడు ఆ వృద్ధుడు.

మాధవుడు ఆశ్చర్యపోయాడు. తన వీపు మీద నల్లని మచ్చ ఉన్నట్లు ఈ వృద్ధునికెలా తెలిసింది?

ఆ మచ్చను చూసిన తరువాత ఆ వృద్ధుడు, ''సందేహం లేదు. నువ్వే!'' అని గొణుక్కోవడం మాధవుడి చెవిన బడింది.

''ఏమిటి తాతగారూ సంగతి?'' అని అడిగాడు మాధవుడు.

ఆ వృద్ధుడు చిన్నగా నిట్టూర్చి, ''నాయనా! ఈ కోటను గురించి అందరికీ వివరించి చెబుతున్నావుగానీ-నీకూ, ఈ కోటకూ ఉన్న సంబంధం గురించి నీకు తెలుసా,'' అని అడిగాడు.

''ఈ కోటకూ, నాకూ ఉన్న సంబంధమా?'' మాధవుడు ఆశ్చర్యపోయాడు. ఈ కోట తనకు నీడనిచ్చి అన్నం పెడుతోంది. అంతే కదా సంబంధం. ఒక వేళ గతంలో తను ఈ రాజ వంశస్థుడినని అబద్ధం చెప్పుకున్న సంగతి ఈ వృద్ధుడికెలాగో తెలిసిపోలేదు కదా?

''నాకేమీ తెలియదే?'' అనేశాడు మాధవుడు.

''అవును. నువ్వు సింగభూపతి మునిమనుమడినన్న సంగతి నీకెలా తెలుస్తుందిలే!'' అన్నాడు ఆ వృద్ధుడు.

"ఏమంటున్నారు తాతగారూ!" మాధవుడు దిగ్భ్రాంతి చెందుతూ అన్నాడు.

"అవును బాబూ! సింగభూపతి ముని మనవడివైన నువ్వు ఈ విధంగా జీవించడం చాలా విచారించదగ్గ విషయం." అన్నాడా వృద్ధుడు. మాధవుడు ఆశ్చర్యం నుండి తేరుకోలేదు.

"నీ ముత్తాత సింగభూపతి యుద్ధంలో మరణించి కోట కొల్లగొట్టబడిన తరువాత నీ తాత రాజేంద్ర భూపతి అంటే సింగ భూపతి కుమారుడు చాలా సామాన్యమైన బతుకు బతికాడు హేలాపురిలో. నీ తండ్రి హయాంలో వచ్చే సరికి మీరు రాజవంశ స్థులని ఎవరికీ తెలియదు. నువ్వు పుట్టిన తరువాత నీ చిన్నతనంలోనే నీ తల్లి దండ్రులిద్దరూ మరణించడంతో నీ వంశం గురించి కాదు కదా, నీ గురించి కూడా ఎవ్వరూ పట్టించుకోలేదు. అప్పట్లో నేను పోరుపెడితే - నా మనుమడు నిన్ను కొంతకాలం సాకాడు. నా మనుమడికి మాళవదేశంలో ఉన్నతోద్యోగం దొరకడంతో తప్పని పరిస్థితిలో మేము నిన్ను వదిలి ఆ దేశం వెళ్ళిపోయాము. నిన్ను గురించీ, నీ వంశం గురించీ తెలిసిన నేను ఆ తరువాత నిన్నలా వదిలి వెళ్ళినందుకు చాలా బాధ పడ్డాను. ఇన్నాళ్ళకు నిన్ను మళ్ళీ చూడ గలిగినందుకు చాలా సంతోషంగా ఉంది బాబూ," అంటూ ఆప్యాయంగా మాధవుడి భుజం తట్టాడు ఆ వృద్ధుడు.

ఆయన మాధవుడిని హేలాపురిలో ఉన్న తమ స్వంత భవనానికి తీసుకువెళ్ళి



తమ ఇంట్లో ఉన్న సింగభూపతి నిలువెత్తు చిత్రపటాన్ని చూపించాడు.

ఆ పటంలో ఉన్న సింగ భూపతి పోలికలు తనలో కొట్టవచ్చినట్లు కనబడేసరికి మాధవుడు నిర్ఘాంతపోయాడు.

తను సింగభూపతి వంశస్థుడినేనని మాధవుడికిప్పుడు నమ్మకం కలిగింది.

తను పొట్టగడుపుకోవడానికి ఒకనాడు తెలియక ఆడిన అబద్ధపు మాట అక్షరాలా నిజమేనని తెలిసి అతను చాలా ఆశ్చర్య పోయాడు. ఆ వృద్ధుడికి కృతజ్ఞతలు తెలియపరచి మాధవుడు ఆయన వద్ద సెలవు తీసుకుని వచ్చేశాడు.

అటు తరువాత కూడా మాధవుడు ఆ కోటను గురించి, ఆ రాజ వంశం గురించి యాత్రికులకు వివరిస్తూనే బ్రతుకు

గడిపేడు గానీ తనూ ఆ రాజ వంశస్థుడినే ననే నిజం మాత్రం ఎవ్వరికీ ఎప్పుడూ చెప్పుకోలేదు.

రాజుకు ఈ కథ చెప్పి బేతాళుడు, ''రాజా! మాధవుడు ఎందుకలా చేశాడు. తాను ఆ వంశం వాడినని తెలియక ముందు తను ఆ వంశస్థుడిననే అబద్ధ మాడిన మాధవుడు తాను ఆ రాజ వంశ స్థుడినన్న నిజం తెలిసిన తరువాత ఆ సంగతి అందరితో ఎందుకు చెప్పుకో లేదు. అలా చెప్పుకుని ఉంటే బాగా ధనం సంపాదించి సుఖమైన జీవితం గడిపి ఉండేవాడు కదా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల వెయ్యి ముక్కలవుతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మాధవుడు చేసిన పనిలో అనౌచిత్యం ఏమీ లేదు. తను ఆ రాజ వంశస్థుడినని తెలియనప్పుడు అబద్ధమాడి ప్రజల సానుభూతి పొంది డబ్బు సంపాదించాలనుకున్నాడు. అలా చేశాడు కూడా. కానీ తాను నిజంగా ఆ రాజ వంశస్థుడినేనని తెలిసిన తరువాత అతను అలా చెప్పుకోలేక పోవడానికి కారణం - ప్రజలు గొప్పగా ఊహించుకుంటున్న తమ రాజ వంశకీర్తి తన కారణంగా అప్రతిష్ట పాలు కావడం ఇష్టంలేక పోవడం వల్లనే. అతను తను ఆ రాజవంశం వాడినని చెప్పు కుని ఉంటే ముందు తరాల వాళ్ళకు గతం లోని ఆ రాజ వంశ వైభవం గుర్తుకు రాదు సరికదా మాధవుడి దురదృష్టకర జీవితమే జ్ఞాపకం వస్తుంది, మహారాజు సింగభూపతి గుర్తుకురాదు సరికదా పేదవాడిగా బతుకు తున్న మాధవుడే జ్ఞాపకం వస్తాడు. ఇన్ని ఆలోచించిన మాధవుడు తాను ఆ రాజ వంశం వాడినని ఎవ్వరికీ చెప్పుకోలేదు. ఆ విధంగా అతను తన పూర్వీకుల కీర్తి ప్రతి ష్టలను అలాగే కలకాలం నిలిపి ఉంచ గలిగాడు.'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌన భంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. - కల్పితం

*[ఆధారం : కోనే నాగవెంకట ఆంజనేయులు]*





# బైరాగి-రాక్షసుడు

విశాలపురానికి ఓ బైరాగి వచ్చి ఊరంతా తిరిగి ఐదుగురు అదృష్టవంతుల్ని ఎన్నిక చేసాడు. ఆయన వద్ద మహిమగల అక్షయ పాత్ర ఉన్నదట. మోసం చేయకుండా, ఎవరి మనసూ నొప్పించకుండా సంపాదించినదైతే అందులో వేసిన డబ్బు వందరెట్లు అవుతుందట. కాని పక్షంలో గుటకాయ స్వాహా అవుతుందట.

''మీరు ఐదుగురూ ఎంతైనా డబ్బు వేయొచ్చు. అది అన్యాయార్జితం కాకూడదు'' అని బైరాగి చెప్పగా-ఎన్నికైన అదృష్టవంతులు ఒకొక్కరుగా ముందుకు వచ్చి అందులో డబ్బు వేసారు.

మొదటివాడు వంద వరహాలు వేస్తే వాడికి పదివేల వరహాలొచ్చాయి. తర్వాత రెండోవాడు రెండొందలూ, మూడోవాడు మూడొందలూ, నాలుగోవాడు నాలుగొందలూ వరహాలు వేసి వంద రెట్ల ప్రతిఫలం పొందేరు. దీంతో బైరాగి చెప్పిన మాటమీద ఊరి జనం అందరికీ గురి కుదిరింది.

ఐదోవాడు విరూపుడనే జూదరి. వాడి వద్ద ఎందరినో మోసగించి సంపాదించిన సొమ్ము వెయ్యి వరహాల వరకూ ఉన్నది. అయినా ఆ విషయం అక్షయపాత్రకేం తెలుస్తుందిలే అని ధైర్యం చేసిన విరూపుడు ఆ సొమ్ము అందులో వేసాడు. అక్షయ పాత్రలో పడీపడగానే అది గుటకాయ స్వాహా అయింది.

విరూపుడు గుండెలు బాదుకుని రాగాలు తీస్తూ, ''ఇది నా కష్టార్జితం. ఇది మాయమైందంటే నువ్వు మోసగాడివి. నీ అక్షయపాత్ర పెద్ద మోసం'' అంటూ పెద్దగా గొడవ చేసాడు.

వసుంధర




బైరాగి చలించకుండా, ''నేను బైరాగిని. పరోపకారం కోసం ఈ పాత్రను ఉపయోగిస్తున్నాను తప్ప నాకు ధనాపేక్ష లేదు. అన్యాయార్జితం కాబట్టే నీ డబ్బు మాయమైంది.

అయినా నా మీద నిందవేసావు కాబట్టి – పోయిన డబ్బు దక్కించుకునేందుకు నీకింకో అవకాశం ఇస్తాను. నీకు తెలిసిన మంచివాళ్లనడిగి న్యాయార్జితమైన డబ్బు తేగలిగినంత డబ్బు తెచ్చుకో. అది వంద రెట్లు అయితే కొంత వారికిచ్చి కొంత నువ్వుంచుకో'' అన్నాడు.

విరూపుడు వెంటనే ఊళ్లో తనకి తెలిసినవారందర్నీ ఒకొక్కరుగా కలుసుకుని విషయం చెప్పి డబ్బడిగాడు. అయితే తమ డబ్బు న్యాయార్జితమని నమ్మకం లేక కొందరూ, విరూపుడిమీద నమ్మకం లేక కొందరూ వాడికి డబ్బివ్వలేదు.

ఆ ఊళ్లో తనకి డబ్బు పుట్టదని తేలిపోగానే విరూపుడు బైరాగిని కలుసుకుని, ''శంఖవరం గ్రామంలో నా బాబాయి గౌరవుడు ఉంటున్నాడు. ఆయన పుణ్యాత్ముడు, ధర్మాత్ముడు. ఆయన్నడిగి డబ్బు తెస్తాను. నేనక్కడికి వెళ్లి రావడానికి రెండు దినాల గడువు కావాలి'' అన్నాడు. బైరాగి సరేనన్నాడు.

విరూపుడు ఒక రోజంతా ప్రయాణం చేసి శంఖవరం చేరుకుని బాబాయి గౌరవుణ్ణి కలుసుకున్నాడు.

గౌరవుడికి ఇద్దరు కూతుళ్లు, ఇద్దరు కొడుకులు. పెద్ద కూతురికి పెళ్లి కుదిరింది. పెళ్లి ఖర్చుల కోసమని డబ్బు కూడబెడుతుంటే ఆయన పొలానికి పక్కనే ఉన్న పొలం చౌక బేరానికి వచ్చింది. ఏం చేయాలా అని వారు సతమతమవుతున్న సమయంలో విరూపుడొచ్చాడు.

''ఇప్పుడు మీ దగ్గిరున్న రెండువేల వరహాలూ నాకివ్వండి. ఒక్క రోజులో నేను దాన్ని రెండు లక్షల వరహాలు చేస్తాను. ఆ డబ్బుని నలుగురం సమంగా పంచుకుందాం. నాకూ మీకూ డబ్బు చిక్కులు తీరిపోవడమే కాదు, మీ డబ్బు న్యాయార్జితమని అందరికీ తెలుస్తుంది'' అన్నాడు విరూపుడు.

గౌరవుడు, ఆయన కొడుకులు సరేనని విరూపుడికి డబ్బిచ్చారు. అతడు తిరిగి ఒక రోజంతా ప్రయాణం చేసి బైరాగి

దగ్గిరకొచ్చాడు. బైరాగి ఆ సొమ్ముని రెండు లక్షల వరహాలు చేసి, ''డబ్బు పంపకం విషయంలో మోసం చేస్తే ఈ సొమ్ము నీకు దక్కదు. కాబట్టి వెంటనే ఎవరికి ఇవ్వాల్సింది వారికిచ్చి మిగిలింది నువ్వుంచుకుని ఇకమీదటైనా సన్మార్గంలో మసలు'' అని బోధ చేశాడు.

అయితే వచ్చిన డబ్బులో నాలుగింట మూడొంతులు ఉత్తి పుణ్యానికే గౌరవుడి కుటుంబానికివ్వడం విరూపుడికి ఇష్టం లేదు. కానీ బైరాగి మాటలకి భయపడి అతడు శంఖవరం బయల్దేరాడు. అయితే ఈసారి దారిలో అతణ్ణి రాక్షసుడొకడు పట్టుకుని, ''మంచి ఆకలి మీదున్నాను. నిన్ను తిని నా ఆకలి తీర్చుకోవాలనుంది. అయితే నిన్నెందుకు చంపకూడదో సరైన కారణం చెప్పగలిగితే నిన్ను విడిచిపెట్టేస్తాను'' అన్నాడు. విరూపుడు వణికిపోతూ రాక్షసుడికి తన కథ పూర్తిగా చెప్పి, ''నా వద్దనున్న సొమ్ములో నాలుగింట మూడొంతులు నా బాబాయి గౌరవుడిది. దాన్ని ఆయనకు అందజేయకపోతే నమ్మక ద్రోహినౌతాను. కానీ నువ్వు నన్ను తినేస్తే ఆ పాపం నాది కాదు, నీదవుతుంది. కాబట్టి నన్ను వదులు'' అన్నాడు.

రాక్షసుడో క్షణం ఆలోచించి, ''అయితే కాసేపు నువ్వు నా రూపు ధరించు. నేను నీ డబ్బు తీసుకుని నీ రూపంలో గౌరవుడి వద్దకు వెడతాను. సమయం చూసి ఆ కుటుంబంలో అందర్నీ చంపి తినేసి నా ఆకలి తీర్చుకుంటాను. తిరిగొచ్చి నీ డబ్బు నీకిచ్చేస్తాను. ఆ తర్వాత నా రూపం నాది. నీ రూపంతో నీ జీవితం నీది. అలా ఇద్దరికీ ప్రయోజనం'' అన్నాడు.



ఈ ఉపాయం విరూపుడికి నచ్చింది. బైరాగి చెప్పిన ప్రకారం తను డబ్బు పంపకంలో మోసం చేయకూడదు. అయితే రాక్షసుడు గౌరవుడి కుటుంబాన్ని చంపి తినేస్తే- ఏ మోసమూ చేయకుండానే రెండు లక్షల వరహాలూ తనే దక్కించుకోవచ్చు. ఈ పాపం తనకు అంటదు గాక అంటదు.

విరూపుడు సరే అనగానే రాక్షసుడు విరూపుడుగానూ, విరూపుడు రాక్షసుడుగానూ రూపం మార్చుకున్నారు. తరవాత డబ్బు తీసుకుని విరూపుడి రూపంలోని రాక్షసుడు అక్కణ్ణించి శంఖవరం దారి పట్టి వెళ్ళిపోయాడు.

తర్వాత కాసేపటికి అక్కడికి బైరాగి వచ్చాడు. రాక్షస రూపంలో ఉన్న విరూపుడాయనకి జరిగింది చెబితే, ''అయ్యో! ఎంత పని చేసావు? ఇలా జరుగుతుందని నేనొచ్చి హెచ్చరించేలోగా ఇంత ఘోరం జరిగిపోతుందనుకోలేదు. ఇక నీ డబ్బు నీకు దక్కదు'' అన్నాడు.

విరూపుడు కంగారుపడి, ''జరిగిందాంట్లో నా తప్పు లేదు. తన్నుమాలిన ధర్మముండదుకదా! నా ప్రాణాలు రక్షించుకునేందుకు రాక్షసుణ్ణి నా రూపంలో గౌరవుడింటికి పంపడం - ఆయనకి నమ్మకద్రోహం చేసినట్లు కాదు. నా డబ్బు నాకెందుకు దక్కదు?'' అనడిగాడు.

''నేను నమ్మకద్రోహం గురించి నిన్ను సంజాయిషీ అడగడం లేదు. ఆ రాక్షసుడు కూడా ఒకప్పుడు నీలాంటి మనిషే. వాడికి మనుషుల్ని తినే శక్తి ఏ మాత్రమూ లేదు. నువ్వు వాడి మాయ మాటలు నమ్మావు. ఇష్టపడి నీ రూపాన్ని వాడికిచ్చి వాడి రూపాన్ని నువ్వు ధరించావు. వాడింక ఇటు మైపు తిరిగిరాడు. తిరిగి నీకు మానవరూపం రావాలంటే నేను అక్షయపాత్ర తీసుకుని మళ్లీ ఊళ్లమీద పడాలి. నీవంటి స్వార్థపరుడు, కృతఘ్నుడు మరొకడు దొరికే వరకు నువ్విలా రాక్షసరూపంలోనే ఉండాలి'' అని నిట్టూర్చి అక్కణ్ణించి వెళ్లిపోయాడు బైరాగి.



# లౌక్యం

కల్లోల రాజ్యాన్ని పాలించే తిక్కరాజుకి ఒకసారి ప్రపంచంలో-అన్నిటికంటే తీయనైనది ఏమిటో తెలుసుకోవాలన్న కోరిక కలిగింది. తన సందేహాన్ని సభికులందరికీ వెల్లడించి సరైన సమాధానం ఇచ్చిన వారికి చక్కని బహుమతి ఇస్తానని ప్రకటించాడు.

అతని తిక్క గూర్చి తెలిసిన సభ్యులు ఏం చెబితే ఏం కొంప మునుగుతుందోనన్న భయంతో మౌనం వహించారు. ఇంతలో ఒక వ్యక్తి లేచి ''ప్రపంచంలో అన్నిటి కంటే తీయనిది పంచదార,'' అన్నాడు. రాజుకు ఆ సమాధానం నచ్చలేదు. మరో వ్యక్తి లేచి ''మహారాజా! పంచదార కంటే బెల్లం తీయనైనది,'' అన్నాడు. ఈ సమాధానమూ తిక్కరాజుకు రుచించ లేదు. సభలోంచి మరో వ్యక్తి లేచి, ''మహారాజా, రకరకాల పూల నుండి తేనెటీగలు సేకరించిన తేనె అన్నింటి కంటే తీయనైనది,'' అని చెప్పాడు. ఈ జవాబుకీ రాజు సంతృప్తి చెందలేదు.

అంతలో సభలో విజ్ఞుడనిపించుకున్న వ్యక్తి నించుని, ''మహారాజా, పంచదార, బెల్లం తేనె.. నిత్యం వీటి చుట్టూ తిరుగుతూ వీటినే ఆరగించే చీమ అన్నిటికంటే తీయనైనది.'' అన్నాడు. ఈ సమాధానం విన్న తిక్కరాజు అతన్ని మెచ్చుకుని తగిన బహుమతి ఇచ్చాడు.

ఈ తతంగమంతా గమనించిన ఒక బాలుడు, సభ ముగిశాక ఇంటికి వెళుతున్న విజ్ఞుడితో, ''మీ సమాధానం రాజుని సంతృప్తిపరిచిందేమో గాని నాకు మాత్రం తప్పని పిస్తోంది,'' అన్నాడు.

అంతట విజ్ఞుడు చిరునవ్వుతో, ''అవున్నాయనా, సృష్టిలోనే అన్నిటికంటే తీయనైనది - తల్లి ప్రేమ. కాని సందర్భాన్ని బట్టి, ప్రశ్నించిన వారి బుద్ధి కుశలతకు అనుగుణంగా సమాధానం ఇవ్వడం లౌక్యం. అందుకే అలా చెప్పవలసి వచ్చింది,'' అన్నాడు.

ఈ వివరణతో సంతృప్తి చెందిన బాలుడు విజ్ఞునికి నమస్కరించి వెనుదిరిగాడు.

– మల్లారెడ్డి మురళీ మోహన్






# ప్రణయ రాయబారం

‘‘పద్మావతి ధరణీదేవి, ఆకాశరాజుల పుత్రిక. నారాయణపురం రాజధానిగా తొండమండలాన్ని ఏలుతున్నాడు ఆకాశ రాజు'' అన్నాడు శ్రీనివాసుడు పద్మావతి గురించి చెబుతూ. పద్మావతిది అలౌకిక సౌందర్యమనీ, ఆమె తనను చేపట్టడానికే జన్మించిందనీ అన్నాడు.

‘‘నీ మనసును దోచుకున్న కన్య సామాన్య కన్య అయి ఉండదనిపిస్తోంది నాయనా.'' అంది వకుళమాలిక.

‘‘గత జన్మలో, అంటే ద్వాపరయుగంకు ముందు గడిచిపోయిన త్రేతాయుగంలో ఆమె నన్ను పరిణయం చేసుకోవాలని కోరింది. అది నా రామావతార సమయం. ఆ అవతారంలో నేను ఏకపత్నీవ్రతుణ్ణి. భవిష్యత్తులో వివాహం చేసుకుంటానని అప్పుడు సంకల్పించాను'' అన్నాడు శ్రీనివాసుడు.

పద్మావతి పూర్వజన్మ గాథ వినిపించమని కుతూహలంగా అడిగింది వకుళమాలిక. పూర్వజన్మలో పద్మావతి వేదవతి అనీ, ఆమె వృత్తాంతం వినిపిస్తాననీ చెప్ప సాగేడు..

‘‘పూర్వం కుశధ్వజుడు అనే తపస్వి శ్రీమహాలక్ష్మిని పుత్రికగా పొందాలన్న కోరికతో తపస్సు చేశాడు. లక్ష్మీదేవి అంశ ఆయన పుత్రికగా జన్మించింది. కుశధ్వజుడు ఆ బాలికకు వేదవతి అని నామకరణం చేశాడు. అల్లారుముద్దుగా పెరిగిన వేదవతికి యుక్తవయస్సు వచ్చింది. కుమార్తె వేదవతిని విష్ణుమూర్తికి తప్ప మరెవ్వరికీ భార్యగా ఇవ్వనని వ్రతం

వక్కలంతం సూర్యనారాయణ రావు



పట్టాడు కుశధ్వజుడు. అందాలరాశి అయిన వేదవతిని దంభుడు అనే రాక్షసుడు పెళ్ళాడాలనుకుని కుశధ్వజుణ్ని అడిగాడు. ఆయన తన కుమార్తెను శ్రీహరికి అంకితం చేశానన్నాడు. దంభాసురుడు పగ పెంచుకున్నాడు. ఒకనాటి రాత్రి నిద్రిస్తున్న కుశధ్వజుడిని చంపివేశాడు. ఆ తపస్విని హత్య చేసిన పాపంవల్ల దంభాసురుడు చచ్చిపోయాడు. కుశధ్వజుడి ఇల్లాలు భర్తతో సహగమనం చేసింది.

తల్లిదండ్రులిద్దరినీ పోగొట్టుకున్న వేదవతి, తండ్రి ఆశయం ప్రకారం శ్రీహరిని పెళ్ళాడే సంకల్పంతో తపస్సు చేయసాగింది. హిమాలయ పర్వతప్రాంతంలో విహరిస్తున్న రావణాసురుడు వేదవతిని చూశాడు. తపస్సుమాని, తనను పెళ్ళాడమంటూ బలవంతం చేశాడు. వేదవతి తిరస్కరించింది. ఆమెను బలవంతంగా తీసుకువెళ్ళడానికి చెయ్యి పట్టుకున్నాడు రావణుడు. తనను తాకి అపవిత్రం చేశాడన్న ఆగ్రహంతో వేదవతి ఆత్మార్పణం చేయతలపెట్టింది. యోగాగ్నిని పుట్టించి, అందులో తనను తాను దహనం చేసుకుంది.

యోగాగ్నిలో దేహన్ని అర్పణ చేసిన వేదవతి అనంతర అవతారంలో ఆకాశ రాజుకు పుత్రికగా లభించింది. యుగయుగాలుగా జన్మలెత్తుతూ వేదవతి నన్ను భర్తగా పొందటానికి తపిస్తోంది...'' అంటూ వేదవతి గాథను ముగించాడు శ్రీనివాసుడు.

పద్మావతి పూర్వజన్మ గాథను విన్న వకుళమాలిక హృదయం ఆనందంతో నిండిపోయింది. ''ఆకాశరాజు దంపతులతో సంప్రదించి, పద్మావతితో నీ వివాహం జరిగేలా చూస్తాను'' అని శ్రీనివాసుడికి ధైర్యం చెప్పింది. వెంటనే ప్రయాణమై నారాయణపురం దారిపట్టింది.

వకుళమాలిక వెళ్ళగానే శ్రీనివాసుడు ఆలోచనలో పడ్డాడు. ఆమె ప్రతిపాదనను అంగీకరించడానికి ఆకాశరాజు దంపతులను మానసికంగా సిద్ధం చేయటం అవసరం అనిపించింది ఆయనకు. ఆ పని స్వయంగా తానే చేయాలి. అందుకు తన రూపం పనికిరాదు. రాజదంపతులను నమ్మించగలిగిన రూపంలో వెళ్ళాలి. ఆలోచిస్తున్న శ్రీనివాసుడికి సోదె కత్తె

రూపంలో వెళ్తే కార్యం జయప్రదమవుతుందని తోచింది. ఆలోచన కలిగిన ఆ క్షణంలోనే శ్రీనివాసుడు సోదెకత్తెగా మారిపోయాడు.

బ్రహ్మదేవుడిని చంటిపిల్లవాడుగా చేసి, చంకనెత్తుకున్నాడు. పరమశివుడిని మంత్రదండంగా చేసి, చేత్తో పట్టుకున్నాడు. గురివెంద పూసల నగలు, గవ్వలతో చేసిన దండలు, చేతిలో వెదురు బుట్ట, ముమ్మూర్తులా సోదెకత్తెలా రూపాంతరం చెందిన శ్రీనివాసుడు నారాయణపురం వైపు ప్రయాణం సాగించాడు.

నారాయణపురం చేరుకున్న సోదెకత్తె నగర వీధులలో ''సోదె చెప్తానమ్మా... సోదె చెప్తాను'' అంటూ తిరగసాగింది. రాజ మందిరం దగ్గరగా తిరుగాడుతున్న సోదెకత్తెను చూసిన పరిచారికలు ఆమె గురించి రాణి ధరణీదేవికి తెలియజేశారు.

రెండు రోజులుగా అన్నమూ, నీళ్లూ ముట్టకుండా మంచంపట్టిన పద్మావతికి ఏమయ్యిందో అర్థంకాని రాణి, సోదెకత్తె ద్వారా తెలుసుకోవచ్చునని అనుకుంది. దాసీ దానిని పంపి, సోదెకత్తెను తన మందిరానికి పిలిపించింది. యువరాణి పద్మావతి అనారోగ్యానికి కారణం ఏమిటో చెప్పమంది.

''కంచి కామాక్షి చెప్తది, మదుర మీనాక్షి చెప్తది, కాశీ విశాలాక్షి చెప్తది...'' అంటూ సోదె ప్రారంభించింది సోదెకత్తె.



పద్మావతి రాజదంపతులకు కూతురు కాని కూతురని చెప్పింది. ఆమె భూమిలో పుట్టిన పిల్ల అంది. కోయదొర వేషంలో వేటకు వచ్చి, తోటలో ప్రవేశించిన దివ్య పురుషుడిని చూసి వరించిందనీ, ఆ పురుషుడి వియోగాన్ని భరించలేకే బాధ పడుతోందని వివరించింది.

పద్మావతిని నీలమేఘశ్యాముడైన ఆ దివ్య పురుషుడికి ఇచ్చి వివాహం జరిపించమంది. అలా చేయకపోతే భూమిలో పుట్టిన పిల్ల భూమిలోకే పోతుందని హెచ్చరించింది.

ధరణీదేవి కానుకలు ఇచ్చి, సోదెకత్తెను పంపించి వేసింది. సోదెకత్తె వేషంలో వచ్చినపని ముగించిన శ్రీనివాసుడు వేంకటాచలానికి తిరిగి వెళ్ళిపోయాడు.

''సోదెకత్తె చెప్పినది నిజమేనా'' అని ధరణీదేవి పద్మావతిని చూసి అడిగింది. ''నిజమే.. ఆ నీలమేఘశ్యాముడు నా మనసును తొలిచూపులోనే వశం చేసుకున్నాడు. ఆ దివ్య పురుషునితో వివాహం జరిపించకపోతే నేను జీవించి ఉండలేన''ని కన్నీళ్ళు కారుస్తూ చెప్పింది పద్మావతి.

ధరణీదేవి సోదెకత్తె చెప్పిన విషయాలనూ, పద్మావతి అభిప్రాయాన్నీ భర్త ఆకాశరాజుకు వివరించింది. ''కొండ మీద ఉండే ఆ కోయ యువకుడు ఎవరో తెలుసుకుని, రాజ పురోహితులతో సంప్రదించి అమ్మాయి వివాహం జరిపించండి ప్రభూ..'' అంది.

''ఎవరో వచ్చి కన్యను ఇవ్వమని అడిగితేగానీ మనం కన్యాదానం చేయలేం. అడగకనే కన్యను ఇవ్వటం ఆచారం కాదు కదా..'' అన్నాడు ఆకాశరాజు.

నారాయణపురానికి బయలుదేరిన వకుళమాలిక ఆ పట్టణం పొలిమేరలోని శివాలయం చేరుకుంది. ఆమె వెళ్ళే సమయానికి పద్మావతి చెలికత్తెలు ఆలయంలో అర్చనలు చేయిస్తూ కనిపించారు. వకుళమాలిక వాళ్ళతో పరిచయం చేసుకుంది. అర్చనలు ఎందుకు చేయిస్తున్నారని ఒక చెలికత్తెను ప్రశ్నించింది.

''మా యువరాణి పద్మావతి జ్వరంతో మంచంపట్టింది. ఆమె ఆరోగ్యం కుదుటపడటానికి శాంతిపూజలు చేయిస్తున్నామ''ని చెప్పింది చెలికత్తె.

''నేను ఆకాశరాజు దంపతులతో ముఖ్యమైన పని ఉండి వచ్చాను. నాకు మీరు రాజదంపతుల దర్శనం చేయి



స్తారా..'' అని వాళ్ళను అడిగింది వకుళ మాలిక.

చెలికత్తెలు అందుకు సరేనని అన్నారు.

వకుళ మాలికను చెలికత్తెలు రాజ దంపతుల సముఖానికి తీసుకుని వెళ్ళారు. వకుళమాలిక ఆకాశరాజు దంపతులకు శుభాకాంక్షలు తెలిపింది. ఆమె రాకకు కారణం అడిగాడు ఆకాశరాజు.

''మహారాజా.. నా పేరు వకుళమాలిక. నాకు కుమారుడితో సమానుడైన శ్రీని వాసుడికి కన్యను అన్వేషిస్తున్నాను. వేంక టాద్రిమీద నివాసం ఉన్న శ్రీనివాసుడు చూడచక్కనివాడు. అతను సామాన్య మాన వుడు కాడు. దివ్య పురుషుడు. మీ కుమార్తె పద్మావతిని తోటలో చూసి తొలిచూపులోనే వరించాడు. నిద్రాహారాలుమాని ఆమె కోసం పరితపిస్తున్నాడు. సౌభాగ్యవతి పద్మావతిని శ్రీనివాసుడికి కన్యాదానం చేయండి'' అంది వకుళమాలిక.

ఆకాశరాజు శ్రీనివాసుడి కులగోత్రాల వివరాలు అడిగాడు. శ్రీనివాసుడు చంద్ర వంశానికి చెందినవాడనీ, అతడిది వాసిష్ట గోత్రమనీ వివరించింది వకుళమాలిక. ఆకాశరాజు దంపతులు వకుళమాలికకు అతిథి మర్యాదలు చేశారు.

పద్మావతిని శ్రీనివాసుడికి కన్యాదానం చేసేముందు, అతని గురించిన కొన్ని సందేహాలు నివృత్తి చేసుకోవడం మంచి దనిపించింది ఆకాశరాజుకు.

దేవగురువు, తమ మేలుకోరే విజ్ఞుడూ అయిన బృహస్పతి ఆచార్యుడిని ఆహ్వా నించి, వెంటబెట్టుకు రమ్మని కొడుకు వసుదాసుడిని పంపించాడు.

ఆకాశరాజు ఆహ్వానాన్ని మన్నించి బృహస్పతి వేంచేశాడు. వేంకటాచల వాసు డైన శ్రీనివాసుడితో మా పుత్రిక పద్మావతి వివాహానికి ప్రతిపాదన వచ్చింది. ''మీ అభిప్రాయం సెలవీయండి'' అన్నాడు ఆకాశరాజు.

''ఆ విషయంలో శుక యోగీంద్రుడిని సంప్రదించటం మంచిది'' అన్నాడు బృహస్పతి.






ఒకనాడు డుండుకం అనే నల్లి సంచారం చేస్తూ రాజు పడుకునే మంచం మీదికి వచ్చి, అక్కడ ఉన్న పేనును చూసింది.

''రాజుగారి పడకమీదికి ఎందుకు వచ్చావు. వెంటనే వెళ్ళిపో,'' అన్నది పేను నల్లితో.

దానికి నల్లి, ''అమ్మా, అలా మాట్లాడకు. నేను నీ అతిథిని, ఇంటికి వచ్చిన అతిథి పట్ల అలా ప్రవర్తించరాదు. నేను రకరకాల మనుషుల రక్తం చవిచూశాను. ఆహారదోషాల వల్ల వారి రక్తం కటువుగానో, కారంగానో, చేదుగానో, పుల్లగానో ఉంటుంది. ఈ దోషాలేమీ లేని తియ్యని రక్తం ఇంత వరకూ చవి చూసి ఎరగను. ఈ రాజు మహా రుచికరమైన వంటకాలూ, మంచి ఫలాలూ, అపురూపమైన పక్షుల, మృగాల మాంసం తింటాడు. గొప్ప వైద్యులు ఆయన రక్తం శుద్ధంగా ఉండేటట్టు చూస్తూ ఉంటారు. నువ్వు అనుమతించితే అమృతం లాంటి ఈ రాజు గారి రక్తం తాగి ఆనందించాలనుంది. రాజయినా, బిచ్చగాడయినా సుఖభోజనం కోరుతారు గద. జిహ్వా చాపల్యం రేకెత్తించే రుచికరమైన వస్తువులే ప్రపంచంలో లేకపోతే ఒకడికి మరొకడు సేవకుడు కావడం, చెప్పుచేతలలో ఉండటం ఎందుకు జరుగుతుంది? పొట్టకోసమే కదా మనిషి అబద్ధాలాడతాడు. పనికి మాలిన వారికి ఊడిగం చేస్తాడు. దేశాంతరాలకు పోతాడు! అందుచేత, ఆకలితో వచ్చిన నీ అతిథిని రాజు రక్తం చవి చూడనియ్యి,'' అన్నది.

''అది ఏ మాత్రం కుదరదు. నీ తొండం చాలా పదునైనది. కుట్టినప్పుడు చాలా బాధ కలుగుతుంది. పైపెచ్చు నువు విడవకుండా కరుస్తావు. నీ కాట్లకు రాజు తప్పక నిద్ర లేస్తాడు. అది మన ఇద్దరికీ ప్రమాదం. కనక, నువు వెళ్ళిపో,'' అన్నది పేను.

మిత్రభేదం-14

నక్క పేను కాళ్లమీద పడి, ఉండనియ్యమని ప్రాధేయపడింది. దానికి పేను మెత్తబడి, ''సరే, అలాగే ఉండు'' అన్నది.

రాత్రి రాజు వచ్చి పక్కమీద పడుకున్నాడు. ఆయనకు కునుకు పట్టే లోపలనే నల్లి, ఆయన రక్తం రుచి చూడాలనే జిహ్వా చాపల్యంతో, రాజు పెదవిని బలం కొద్దీ కొరికింది. సూదితో గుచ్చినట్టు బాధ కలిగి రాజు లేచి నౌకర్లను పిలిచి, ''నన్నేదో నల్లో, పేనో కుట్టింది. వెతికి చంపండి,'' అన్నాడు.

వాళ్లు వచ్చి పక్క అంతా గాలించారు. నల్లి యుక్తిగా మంచె నెర్రెలోకి దూరిపోయింది. పరుపులో దాగి ఉన్న పేనును కనిపెట్టి నౌకర్లు చంపేశారు.

పింగళకానికి ఈ కథ చెప్పి దమనకం, ''ఈ ఎద్దు లాగా స్వజాతిని విడిచి జాత్యేతరులతో చేరేవాళ్లు, కుకుద్రుమ రాజు అనే నీలినక్క లాగా, అకాలమరణం వాత పడతారు,'' అన్నది.

''ఏమిటా కథ?'' అడిగింది పింగళకం.

దమనకం ఇలా చెప్పింది.

### కుకుద్రుమరాజు కథ

ఒక బస్తీకి సమీపాన గల అరణ్యంలో చండరవం అనే నక్క ఉండేది. ఒక నాటి రాత్రి అది ఆహారం వెతుక్కుంటూ బస్తీలో ప్రవేశించింది. కుక్కలు దాన్ని చూసి భయంకరంగా మొరుగుతూ, వెంటపడ్డాయి. నక్క హడలిపోయి, ప్రాణాలు దక్కించుకునే ప్రయత్నంలో ఒక కలంకారీ వాడి ఇంట జొరబడి, వాడు బట్టలకు రంగు వెయ్యడానికి నీలిరంగు నిలువు చేసి ఉండే తొట్టెలో పడిపోయింది. దాంతో కుక్కలు దూరంగా ఉండి కొంత సేపు మొరిగి వెళ్లిపోయాయి.



నక్క నీలి రంగులో బాగా నానటం చేత దాని శరీరమంతా దట్టమైన నీలం రంగు పట్టుకున్నది. మూఢుడూ, ఎంద్రకాయా, తాగుబోతూ, నీలిరంగూ పట్టుకుంటే వదలవని సామెతే ఉన్నది గద! అమిత ప్రయాసపడి ఎలాగైతేనేం, నక్క నీలిరంగు తొట్టె నుంచి బయటపడి పారిపోయింది.

నక్క అరణ్యానికి తిరిగి వచ్చింది. సింహమూ, పెద్దపులీ, ఏనుగూ, చిరుతపులీ, ఎలుగుబంటూ, తోడేలూ, కుందేలూ, లేడీ, కోతీ, ఇతర అరణ్య మృగాలూ ఒకదానిని ఒకటి రహస్యంగా, ''ఎన్నడూ ఎరగమే, ఎవరీ అద్భుతమైన నీలం ప్రాణి?'' అని అడుగుకున్నాయి.

ఈ కొత్త జంతువు బల శౌర్య పరాక్రమాలు తమకు తెలియని కారణం చేత అవి పక్కకు తప్పుకుని తిరగసాగాయి.

తనను చూసి ఇతర జంతువులు భయ పడుతూ ఉండటం చూసి, చండరవం, ''ఓ వన్యమృగాల్లారా, నన్ను చూసి ఎందుకు బెదిరిపోతున్నారు? మిమ్మల్ని పాలించడానికి రాజు లేడని గ్రహించి ఇంద్రుడు, మీకు రాజుగా ఉండి, మిమ్మల్ని కాపాడటానికి నన్ను పంపాడు. అందుకే నేను వచ్చాను, నా పాలనలో మీరు క్షేమంగా ఉండండి. ఇకనుంచి నేనే మీ రాజును. నా పేరు కుకుద్రుమం,'' అన్నది.

ఈ మాటలు విని అరణ్య మృగాలన్నీ నక్క ముందు సాష్టాంగ పడి ''తమరు చెప్పినట్టు వింటాం,'' అన్నాయి.

కుకుద్రుమం సింహాన్ని తన మంత్రిగానూ, ఇతర మృగాలను ఇతర హోదాలలోనూ నియమించి, తన జాతికి చెందిన నక్కలను హీనంగా చూసి, దూరంగా తరమగొట్టింది. సింహం ఇతర జంతువులు వేటాడి, మాంసం తెచ్చి కుకుద్రుమానికి సమర్పించేవి. ఆ మాంసాన్ని తినగలిగినంత తిని, మిగిలినదాన్ని రాజధర్మం ప్రకారం కుకుద్రుమం అన్ని జంతువులకూ పంచేది.

కొంతకాలం పాటు కుకుద్రుమం పరిపాలన అద్భుతంగా సాగింది.

ఒక రాత్రి నక్క భోజనం ముగించి పవళించింది. సింహమూ, పెద్ద పులీ, ఏనుగూ, చిరుతపులీ, కోతీ, ఇతర అడవి జంతువులు దానికి కావలి కాస్తున్నాయి.

ఉన్నట్టుండి నక్కలమంద ఊళలతో అరణ్యం మారుమోగింది. కుకుద్రుమం తనను తాను మరిచిపోయింది. దాని రోమాలు నిక్కబొడుచుకున్నాయి. ఉద్రేకంతో దాని కళ్లలోకి అశ్రువులు దిగాయి. అది ఆనంద పారవశ్యంలో పడకమీది నుంచి దూకి, బలంగా ఊళ పెట్టింది.

ఇది చూసి సింహం మొదలైన జంతువులు, ''ఇది మామూలు నక్కే'' అనుకుని అవమానంతో క్షణం పాటు తలలు దించేసుకున్నాయి. కాని అంతలోనే వాటికి ఆగ్రహం వచ్చేసింది. ''ఈ క్షుద్ర జంతువు మన సేవలు పొందుతుందా? దీన్ని చంపాల్సిందే!'' అని అనటం విని నక్క తప్పించుకు పారిపోబోయింది. కాని, పెద్దపులి దాన్ని పట్టుకుని చీల్చి చంపేసింది.





# బలవత్తరమైన ఆయుధం

గుణశేఖరుడనే రాజు శిల్లంగేరి దేశాన్ని పరిపాలిస్తూండేవాడు. అతడి ఇరుగు పొరుగు దేశాలవాళ్లు శత్రువులు. బద్ధ శత్రుత్వంతో వీరు ఎప్పుడైనా తన దేశంపై దాడి చేయవచ్చునని భావించిన రాజు తన రాజధాని చుట్టూ అభేద్యమైన, దృఢమైన కోటను నిర్మించాడు. సైనిక బలాన్ని పెంచుకుని కోట ద్వారం వద్ద బలవంతులైన సైన్యాన్ని రాత్రి, పగలు కాపలా ఉంచేడు. పర్యవేక్షణ కోసం ఒక ఉన్నత సైన్యాధికారిని కూడా అక్కడ ఉంచాడు.

ఎంత మంది సైనికులను ఏర్పాటు చేసినా, బందిపోటు దొంగలు తరచుగా కోటలోకి జొరబడి పెద్ద ఎత్తున దోపిడీలు చేస్తుండేవారు. వీరి ఆగడాలను అరికట్టడానికి రాజు గుణశేఖరుడు కోటద్వారాన్ని సూర్యాస్తమయమైన వెంటనే మూసి వేయించి ఎవ్వరినీ లోపలకు రానివ్వవద్దని ఆదేశించాడు. పగటి పూట తన రాజధాని ప్రజలు పనుల మీద కోట బయటకు వెళ్లినా సూర్యాస్తమయం లోగా తిరిగి వచ్చేయాలని ఆదేశించాడు.

తరవాత రాజసభలో మంత్రులను, సైన్యాధికారులను ఇతర ఉన్నతాధికారులను ఉద్దేశించి రాజు గంభీరంగా ఇలా చెప్పాడు. "ఇప్పుడు మన రాజధాని కోట అభేద్యం. మానవ మాత్రులు ఎవరూ దానిని ఛేదించి లోనికి రాలేరు. దుర్భేద్యమైన మన కోటను ఛేదించే ఆయుధం కూడా ఇప్పుడు మన శత్రువుల వద్ద లేదు."

అప్పుడు మహామంత్రి లేచి, "ప్రభువులు క్షమించాలి. మన కోట అభేద్యం కాదు. మన కోటే కాదు, ఈ ప్రపంచంలో ఏ కోటనైనా ఛేదించగల ఆయుధం ఒక

కోలార్ కృష్ణ అయ్యర్

టుంది. దానిని తమకు మనం సాయం కాలం విహారానికి వెళ్ళినప్పుడు విశదీ కరిస్తాను,'' అని చెప్పాడు. అందరూ ఆశ్చర్యచకితులైనారు.

ఆరోజు సాయంకాలం మహారాజు, మంత్రి మారు వేషంలో కోట వెలుపలికి వెళ్ళి చీకటి పడిన తర్వాత కోట ద్వారం వద్దకు వచ్చారు. అప్పటికే కోట తలు పులు మూసి ఉన్నాయి.

మారువేషంలో ఉన్న మంత్రి కోటకు కాపలాగా ఉన్న సైన్యాధికారితో, ''అయ్యా కోటలో మా బంధువుల ఇంటికొచ్చాము. విహారానికి వెళ్ళి వచ్చేలోగా చీకటి పడింది. దయచేసి కోట తలుపులు తెరిస్తే ఇంటికి వెళతాము'' అన్నాడు.

''వీల్లేదు. రాజాజ్ఞ ఎట్టి పరిస్థితు ల్లోనూ మీరలేను. సూర్యాస్తమయమ యిన తర్వాత ఎవరికైనా సరే, కోట తలు పులు రాజాజ్ఞ లేనిదే తెరవలేము. క్షమిం చండి.'' అన్నాడు సైన్యాధికారి.

చాలా సేపు బతిమాలినా లాభంలేక పోయింది. చివరకు మారువేషంలో ఉన్న మహామంత్రి సైన్యాధిపతిని పక్కకు పిలిచి అతడి చేతిలో ఐదువేల బంగారు నాణె ములున్న సంచిని చేతిలో పెట్టి, ''ఇంత ధనం నీవు నీ జీవితంలో ఆర్జించలేవు. తీసుకో,'' అన్నాడు.

ఆ నాణేల సంచి చూడగానే ముఖం వెలిగిపోయిన సైన్యాధికారి చిరునవ్వు నవ్వి సైనికుడిని పిలిచి ''వీరు కోటలోపలకు వెళ్ళడానికి తలుపులు తియ్యి,'' అని ఆదేశించాడు. తలుపులు తెరవగానే రాజు, మంత్రి నిరాటంకంగా కోట లోప లికి వెళ్ళిపోయారు.

ఇది చూస్తున్న రాజుతో మహామంత్రి, ''మహాప్రభూ, నేను చెప్పినట్లుగా ప్రపం చంలో ఏ కోటనైనా ఛేదించగల ఆయుధం ఏదో తెలిసింది కదా! లంచం, దీన్ని రూపు మాపితే కాని మనకు, మన రాజ్యానికి రక్షణ లేదు, అన్నాడు.





# కసి తీర్చుకున్న నౌకరు

ఒక ఊళ్ళో ఒక జమీందారు ఉండేవాడు. అతను పరమ కర్కోటకుడు. అతను తన వెంట అన్నిచోట్లకూ ఒక నౌకరును తీసుకెళుతూ ఉండేవాడు. ఆ నౌకరును జమీందారు అతి దుర్మార్గంగా హింసిస్తూ ఉండేవాడు. ఏదో ఒక వంక పెట్టి ఆ నౌకరు తలమీద చరిచి చావగొడుతూ ఉండేవాడు.

ఒకసారి ఆ జమీందారు గుర్రమెక్కి పొరుగూరికి బయలుదేరాడు. జమీందారులాగే గుర్రంకూడా బాగా పుష్టిగా, ఉండేది. జమీందారు నౌకరుకు మాత్రం ఒక బక్కచిక్కిన గుర్రం ఇచ్చాడు. జమీందారు గుర్రం దర్జాగా నడిచేది కాని నౌకరు గుర్రం మటుకు బలహీనంగా కాళ్ళీడ్చుకుంటూ నడిచేది.

వెళ్ళిన పని ముగించుకుని ఇద్దరూ గుర్రాలెక్కి ఇంటిదారి పట్టారు. కొంతదూరం రాగానే ఆకాశంనిండా మబ్బులు కమ్ముకున్నాయి. అంతలోనే వర్షం మొదలయింది. జమీందారు నౌకరుతో 'ఒరే, మనం గుర్రాలను దౌడు తీయించాలి. లేకపోతే నిష్కారణంగా తడిసి పోతాం' అంటూ తన గుర్రాన్ని అదిలించాడు. అది వెంటనే శరవేగంతో పరిగెత్తసాగింది. అయితే నౌకరుది మాత్రం బక్క గుర్రం కనక ఎంత ప్రయత్నించినా అతన్ని అందుకోలేక పోయాడు. అది చూసిన జమీందారుకు పట్టరాని కోపం వచ్చింది. 'నీ వెధవ గుర్రం అలా కుంటుతుందేమిట్రా? త్వరగా పద' అని అతను కేకలు పెట్టాడు. నౌకరు వినయంగా 'దొరా, తమకు తెలుసుకదా. నా గుర్రానికి అంత శక్తి లేదు. అది మీ గుర్రంతో సమానంగా ఎలా దౌడు తీస్తుంది?' అన్నాడు. 'నువ్వు దాన్ని సరిగా గడ్డి మెయ్యనివ్వటం లేదన్న మాట. తప్పు నీదయితే గుర్రం గురించి ఫిర్యాదు చేస్తావేమిటి?' అంటూ జమీందారు యథాప్రకారం నౌకరు నెత్తిన ఒక చరుపు చరిచాడు.

ఒక వంక వానలో తడుస్తున్న నౌకరు అతను కొట్టిన దెబ్బకు గుర్రం మీదినుంచి జారి పడ

కొడవటిగంటి రోహిణీ ప్రసాద్

కుండా తమాయించుకుని మౌనంగా దెబ్బల బాధ భరించాడు.

అయితే జమీందారు చాలా పిరికివాడు. అతనికి వర్షమన్నా, ఉరుములన్నా, పిడుగులన్నా చచ్చేంత హడలు. ఆ సంగతి నౌకరుకు తెలుసు. నౌకరును కొట్టిన మరుక్షణం ఆకాశంలో పెద్ద మెరుపు మెరిసింది. వెంటనే జమీందారు భయంతో గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. ఆ క్షణంలోనే పిడుగు పడ్డచప్పుడయింది. అదే అదనుగా నౌకరు తన చేతనున్న కర్రతో జమీందారు తలమీద వెనకనుంచి బలంగా ఒక దెబ్బ కొట్టాడు. కళ్ళు మూసుకున్న జమీందారు అది పిడుగుపాటే అనుకుని కళ్ళు తెరవకుండా తన ముఖాన్ని గుర్రపు జూలులో దాచుకున్నాడు. ఇక అక్కడినుంచీ మెరుపుల, పిడుగుల తాకిడి కొనసాగింది. అలా జరిగినప్పుడల్లా ప్రతిసారీ నౌకరు తన యజమాని తలమీద కర్రతో కసితీరా కొడుతూ పోయాడు. చివరకు జమీందారు స్పృహతప్పి గుర్రంపైనుంచి కిందపడిపోయాడు.

ఆ తరవాత నౌకరు తన గుర్రం దిగి నేల మీద పడిఉన్న యజమాని దగ్గరే కూర్చున్నాడు. తనను హింసించే యజమానిమీద కక్ష సాధించినందుకు అతనికి చాలా తృప్తి కలిగింది. కాసేపటికి వర్షపు జల్లుతో జమీందారుకు మెలకువ రావటం గమనించిన నౌకరు అతని పక్కనే తానుకూడా మూర్ఛవల్ల బిగుసుకుపోయినట్టు పడుకున్నాడు.

మూర్ఛనుంచి తెప్పరిల్లిన జమీందారు తన నౌకరుకేసి చూస్తే పిడుగుదెబ్బనుంచి కోలుకోనట్టే కనబడింది. అతను నౌకరును కుదిపి లేపాడు. నౌకరు కళ్ళు నులుముకుంటూ లేచి, 'బాబుగారూ, ఏమయింది? మొదటి పిడుగుపాటుకే నేను మూర్ఛపోయినట్టున్నానే' అన్నాడు.

జమీందారు దర్పంగా మీసాలు దువ్వుకుంటూ, 'నీవంటి పిరికి సన్నాసిని నేనెక్కడా చూడలేదు. కేవలం ఒక్క పిడుగువల్లనే నీ ప్రాణం కడబట్టింది. నన్ను చూడు, నామీద పది పిడుగులు పడినప్పటికీ నేను చెక్కు చెదరలేదు. అదీ నీకూ, నాకూ తేడా' అన్నాడు విజయ గర్వంతో.

'చిత్తం, పదండి, ఇంటికి పోదాం' అన్నాడు నౌకరు దుష్టుడైన యజమానిని తనివితీరా కొట్టినందుకు లోలోపలే నవ్వుకుంటూ.

*(మంగోలియా జానపదకథ ఆధారం)*





# మానవ సహాయం

ఒకప్పుడు మలయ తీరంలో ఒక యోధాన యోధుడు ఉండేవాడు. అతని సాహస చర్యలూ, అద్భుత పరాక్రమమూ గురించి దేశదేశాల వాళ్లు కథలు చెప్పుకునే వారు.

ఒకనాడతను సముద్రతీరాన పచార్లు చేస్తూండగా, ఒక మహాకాయుడు సముద్రంలో నడుస్తూ అతని కేసి వచ్చాడు. ఆ మహాకాయుడు ఒడ్డుకు వచ్చాక యోధాను యోధుడు అతణ్ణి పలకరించి ''ఎవరు నువు? సముద్రం దాటి ఇటుగా ఎందుకు వస్తున్నావు?'' అని అడిగాడు.

''నేను మహాకాయ ద్వీపం నుంచి వస్తున్నాను. మా రాజు యోధానుయోధుడి కొక కబురు చెప్పమని పంపారు.'' అన్నాడా మహాకాయుడు. ''ప్రస్తుతం ఆ యోధుడు అడవికి వేటకు పోయి ఉన్నాడు. అతనితో ఏం చెప్పాలో చెబితే, రాగానే చెబుతాను,'' అన్నాడు యోధుడు.

''మహారాణిగారు ప్రసవించబోతున్నది. లోగడ ఆమె ఇద్దరు మగపిల్లలనూ ఎవరో దొంగలు ఎత్తుకుపోయారు. ఈసారి పుట్ట బోయే బిడ్డను కాపాడటానికి యోధాను యోధుడు రావాలని మా రాజుగారి కోరిక. వెనక బిడ్డలు పుట్టినప్పుడు రాజుగారి కోట లోపలా, వెలుపలా కూడా బలమైన రక్షణలు ఏర్పాటు చేశారు. అయినా దొంగలు రానే వచ్చారు. పిల్లలను ఎత్తుకు పోయారు. వాళ్లెవరో, ఎటుగా వచ్చారో పిల్లలేమయ్యారో, కొంచెం కూడా తెలియరాలేదు,'' అన్నాడు మహాకాయుడు.

''సరే, యోధానయోధుడు తిరిగి వచ్చాక ఈ సమాచారం అతనితో చెబుతాను,'' అన్నాడు యోధుడు.

మహాకాయుడు అతని వద్ద శలవు తీసుకుని సముద్రంలోకి వెళ్లిపోయాడు. మర్నాడు ఉదయం యోధానయోధుడు అదే ప్రాంతంలో

**25** ఏళ్లనాటి చందమామ కథ



పచార్లు చేస్తూ ఉండగా అతనికి ఎనిమిది మంది బుడత మనుషులు పరిగెత్తే ఆటలాడుతూ కనిపించారు. అతను వాళ్లను పలకరించి, ''ఎవరు మీరు? మీరేం పనిచేస్తారు?'' అని అడిగాడు.

''మేం బుడతలం, తలా ఒక పనీ చేస్తాం. నా మటుకు నన్ను చత్రాయి అంటారు. నేను చతికిలపడ్డానంటే నన్నెవరూ కదిలించలేరు.'' అన్నాడు బుడతల్లో ఒకడు. ''ఏదీ, కూర్చో చూస్తాం,'' అన్నాడు యోధానయోధుడు. చత్రాయి నేలమీద చతికిలబడ్డాడు. యోధానయోధుడు వాణ్ణి కొంచెం కూడా కదిలించలేకపోయాడు. అతను ఆశ్చర్యపడి మిగిలిన వాళ్ల శక్తులను గురించి కూడా అడిగాడు.

ఒకడి పేరు దివ్యకర్ణి: వాడు సముద్రం అవతల మాట్లాడుకున్నా ఆలకించగలడు. మరొకడు దూరస్పర్శి: వాడు సముద్రం అవతల భీమ చిటుక్కుమంటే తెలుసుకోగలడు. నాలుగోవాడు మహా జ్ఞాని: వాడికి ప్రపంచంలో ఎక్కడ ఏది జరుగుతున్నదీ తెలుస్తుంది. అయిదోవాడు లఘుహస్తి: వాడు కోడిపొదిగే గుడ్డును కోడికే తెలియరాకుండా కాజెయ్యగలడు. ఆరోవాడు ఆరోహకుడు: వాడు ఈగలు పాకలేని నున్నని గోడలు కూడా ఎగబాకగలడు. ఏడోవాడు విలుకాడు: వాడు వంద రెక్కల పురుగులు ఎగురుతుంటే వాటిలో కావాలన్న దాన్ని బాణంతో కొట్టగలడు. ఎనిమిదో వాడు దారుబ్రహ్మ: వాడి చేతికొక కర్ర ఇస్తే, దానితో వాడు చెయ్యలేనిది లేదు.

''భేష్, ఒక ఓడ తయారు చెయ్యాలంటే, నీకెంత కాలం పట్టుతుంది?'' అని యోధానయోధుడు అడిగాడు.

''నువ్వు ఒక్కసారి గుండ్రంగా తిరిగేటంత సేపు,'' అన్నాడు దారుబ్రహ్మ.

యోధానయోధుడు నిలబడిన చోటనే ఒక్కసారి గుండ్రంగా తిరిగాడు. అతని వీపు సముద్రం కేసి ఉండే క్షణంలో ఆ దారుబ్రహ్మ ఒక కర్రపుల్లను సముద్రపు నీటిమీదికి విసిరాడు. యోధానయోధుడు మళ్లీ సముద్రం కేసి తిరిగేసరికి ఒక పెద్ద ఓడ సిద్ధంగా ఉన్నది.

''నేను సముద్రం మీద, మహాకాయుల దీవికి వెళ్లబోతున్నాను. మీరంతా నా వెంట వచ్చి నాకు సహాయం చేస్తారా?'' అని యోధానయోధుడు బుడతల్లను అడిగాడు.

''సహాయం చేస్తాం, తూర్పు దేశాలలో మాకు తెలీని విషయం లేదు,'' అన్నారు వాళ్లు. యోధానయోధుడు ఎనిమిది మంది బుడతల్లనూ ఓడలో ఎక్కించుకుని ప్రయాణమై, త్వరలోనే మహాకాయులుండే దీవిని చేరాడు. మహాకాయుల రాజు, యోధాన

యోధుడు వచ్చినందుకు పరమానందం చెంది, వారికి ఘన స్వాగతం ఇచ్చాడు. ''మీరు సమయానికి వచ్చారు. ఇవాళే రాణి ప్రసవించింది. ఆమె ప్రసవించిన మొదటి పిల్లలిద్దరూ పుట్టిన రోజు రాత్రే మాయ మయ్యారు. ఈ పిల్లవాడికి కూడా ఈ రాత్రే ప్రమాదం ఉన్నది.'' అన్నాడు.

''మీరేమీ భయపడకండి. నేనూ, నా అనుచరులూ ఈ రాత్రి మీ బిడ్డను కాపాడతాం. కాపాడలేని పక్షంలో మీరు నా తల తీసేయించవచ్చు,'' అన్నాడు యోధాన యోధుడు. రాజభవనంలో మంచి ఇనప్పెట్టె లాటి గది చూసి, అందులో చంటిబిడ్డనూ, ఇద్దరు దాదులనూ ఉంచి, యోధానయోధుడూ, అతని అనుచరులూ కాపున్నారు.

మహాజ్ఞాని యోధానయోధుడితో ''బిడ్డను కాపాడలేకపోతే నీ తల ఇస్తాననటం పొరపాటయింది. ఈ బిడ్డను ఈ రాత్రి మనం కాపాడలేం. దొంగతనం జరిగి తీరుతుంది.'' అన్నాడు.

''అలాగా! ఆ బిడ్డను ఎవరు ఎత్తుకుపోతారో చెప్పు,'' అన్నాడు యోధుడు.

''దొంగ ఈ రాజు చెల్లెలే. ముందు పుట్టిన పిల్లలను కూడా ఆమే ఎత్తుకు పోయింది. ఈ అన్నా చెల్లెళ్ల మధ్య బద్ధ శత్రుత్వం. చెల్లెలు మంత్రాలు నేర్చినది. అదృశ్యరూపంలో కోటలో ప్రవేశించి పొగగూడు నుంచి రహస్యంగా గది లోకి చెయ్యిచాచి దాని బిడ్డలను కాజేసింది,'' అన్నాడు మహాజ్ఞాని.

ఆ మాట వింటూనే చట్రాయి పొగ గూడు కింది భాగంలో చతికిలబడి, ''ఆ పొగ గూడు గుండా చెయ్యి పెట్టిందో, ఆ చేతిని మరి తీసుకోలేదు.'' అన్నాడు. అందరూ



ఎవరి స్థానాల్లో వారు కూర్చున్నారు. అర్ధరాత్రి దాటాక దివ్యకర్ణి, ''మహాకాయ మహారాజు చెల్లెలు తన కోటనుంచి బయలుదేరుతున్నది. మొదట దొంగిలించిన పిల్లలిద్దరినీ జాగ్రత్తగా చూసుకోమని తన నౌకర్లతో అంటున్నది,'' అన్నాడు.

''ఆమె తన ఇంటి కప్పు గుండా పైకి వస్తున్నట్లున్నది. ఆమె ఇంటికి ద్వారాలూ, గవాక్షాలూ లేవు. ఆమె కోట గోడలు గాజు లాగా నున్నగా ఉన్నాయి,'' అన్నాడు దూర స్పర్శి.

కొంచె సేపయాక దివ్యకర్ణి, ''వచ్చేసింది! కాపలావాళ్లకు కనబడకుండా కోటలోకి జొర బడింది,'' అన్నాడు.

మరి కొద్ది క్షణాలలో పొగగూడు గుండా ఒక నల్లని చెయ్యి కిందికి దిగి రాసాగింది. అది కంటబడగానే చట్రాయి చప్పున ఆ

చేతిని పట్టేసుకున్నాడు. చెయ్యి తీవ్రంగా పెనుగులాడింది. కాని ప్రయోజనం లేక పోయింది. చివరకు చెయ్యి ఊడి వచ్చే సింది. చటాయి ఆ చేతిని గదిలోకి లాగే శాడు. యోధుడూ, మిగిలిన బుడతళ్లూ, దాదులూ ఆత్రంగా ఆ చేతి చుట్టూ మూగి ఆశ్చర్యంగా చూడసాగారు.

వాళ్లందరూ ఆ సందడిలో ఉన్న సమ యంలో రాక్షసి తన రెండో చేతిని గదిలోకి పెట్టి, ఉయ్యాల తొట్టెలో ఉన్న పిల్లవాణ్ణి కాజేసి తీసుకుపోయింది.

దాదులు తొట్టెకేసి తిరుగుతూనే, ''అయ్యో బిడ్డ!'' అన్నారు.

''మనం ఓడలో ఎక్కి పారిపోవటం మేలు. తెల్లవారగానే ఈ రాజు మన తలలు తీసే స్తాడు.'' అన్నారు బుడతళ్లు. ''ఎందుకు పారిపోవటం? ఆ రాక్షసి వెన్నంటి పోయి రాజుగారి ముగ్గురు బిడ్డలనూ తీసుకొద్దాం,'' అన్నాడు యోధానయోధుడు.

అందరూ కోట బయటకు వచ్చి, తమ ఓడలో రాక్షసి ఉండే తీరానికి చేరారు. ఆరోహ కుడు లఘుహస్తిని తన భుజాల మీద ఎక్కించుకుని గబగబా కోట గోడ ఎక్కేసి, లఘుహస్తిని కోటలో దించాడు. లఘుహస్తి లోపలి నుంచి-మహాకాయ మహారాజు కొడు కులను ముగ్గురినీ ఆరోహకుడికి వరసగా అందించాడు. అందరూ ఓడలో మహాకా యుల దీవికి బయలుదేరారు.

వారు తీరం చేరకముందే రాక్షసి, పిల్లలు మాయం కావడం తెలుసుకుని, ఓడను వెంబడించి రాసాగింది. ఆమె ఎంత దూరం లోకి వచ్చినదీ దూరస్ఫూర్శి చెబుతూ వచ్చాడు. చూపు మేరలోకి రాగానే విలుకాడు, బాణం వదిలి, ఆమె నుదుట ఉన్న ఒక్క కంటినీ కొట్టేశాడు. ఆ దెబ్బతో ఆ రాక్షసి చచ్చి సముద్రంలో పడిపోయింది.

తెల్లవారగనే మహాకాయ మహారాజు పురిటి గదికి పరిగెత్తుకుంటూ వచ్చి, తన ముగ్గురు పిల్లలనూ చూసి ఆశ్చర్యంతో మూర్ఛపోయినంత పని చేశాడు. ఆయన వారం రోజులపాటు తన అతిథులకు బ్రహ్మాండమైన విందులు చేసి, వారి ఓడ అంతా బహుమానాలతో నింపేసి, యోధాన యోధుణ్ణీ, బుడతళ్ళనూ సాగనంపాడు.





# దొంగకు ఉద్యోగం

ఒక అమాయకపు రైతు తన తోటలో పండిన మామిడి పండ్లు పట్నంలో అమ్ము కోవడానికి నెత్తిన బరువైన బుట్టతో బయ ల్దేరాడు. పట్నం పొలిమేరలోనే అతడికి ఒక ఎడ్లబండి కనిపించింది. బుట్టను మోయ లేకపోతున్న రైతు, ఎడ్లబండి వాడు తన బండి మీద పట్నం వీధుల్లో ఎక్కడైనా దింపుతాడేమోనని ఆశపడ్డాడు.

బండివాడు ఎటు పోయాడో కాని ఎంతకూ రాలేదు. తిరిగి తన బుట్టను నెత్తిమీద పెట్టుకుందామని చూస్తే రైతుకు తన బుట్ట కనిపించలేదు. అతడికి గుండెలు అవిసిపోయాయి. తన పండ్ల బుట్టను ఎవరో తన కన్నుగప్పి ఎత్తుకు పోయినట్టు అతడికి అర్థమైంది.

నేలమీద దొర్లుతూ, మట్టిని తన తల మీద పోసుకుంటూ రైతు ఏడుపు మొదలు పెట్టాడు. ఆ పట్నాన్ని పరిపాలించే సామంతరాజు అదే దారిన పోతూ రైతు పడుతున్న బాధను గ్రహించాడు. తన గుర్రం దిగాడు.

రైతును సమీపించి, 'మామిడిపండ్లు అమ్మితే ఎంత డబ్బు సంపాదించి ఉండే వాడివి?' అని అడిగాడు సామంతరాజు.

రైతు ఆయనకి నమస్కరించి, 'మహా ప్రభూ! నూరు రూపాయలు సంపాదించి ఉండేవాడిని!' అన్నాడు.

సామంతరాజు అతడిని దయగా చూస్తూ, తన వద్ద ఉన్న నూరు రూపాయ లను అతడికి ఇవ్వబోయాడు. రైతు మరొ కసారి నమస్కరించి, 'నాకు నా పండ్లు అమ్మిన డబ్బే కావాలి ప్రభూ! పంటపొ లాల్లో కష్టపడి బతికే వాడిని, దయాధర్మం నాకు ఇష్టముండదు.'' అన్నాడు.

ఎమ్.వి.వి. సత్యనారాయణ



సామంతరాజుకు అతడి నిజాయితీ నచ్చింది. అప్పటికప్పుడు ఆయన తన భటులను పిలిచి, ఎడ్లబండి వద్దనే న్యాయ విచారణ ప్రారంభించాడు. పట్టణ పొలి మేరల్లోనే న్యాయవిచారణ అనేసరికి ప్రజలకు విడ్డూరంగా తోచింది. పట్టణ పాలక వర్గం, ప్రజలూ ఎడ్లబండి వద్ద సభ చేశారు.

సామంతరాజును రైతు విచిత్రంగా చూసి, 'పండ్ల బుట్టతో దొంగ పట్నపు వీధుల్లోకి జారుకున్నాడు. పొలిమేరలో ఉండిపోయి దొంగను ఎలా పట్టుకోగలం ప్రభూ!' అని అడిగాడు.

సామంతరాజు అతడిని సముదా యిస్తూ, తన భటుల చేత కొరడాలతో బండిని కొట్టించాడు. ఆయన ప్రవర్తన అక్కడికి చేరిన వారిలో ఆశ్చర్యం కలిగించింది. అటు తర్వాత భటులు అదే బండిని, 'నిజం చెప్పు. అతడి మామిడి పండ్లు ఎవరు ఎత్తుకు పోయారో వాళ్ల పేరు చెప్పు!' అంటూ పదేపదే కొరడాతో కొట్టడం వారికి నవ్వు కూడా తెప్పించింది.

సామంతరాజుతో సన్నిహితంగా మెలిగే అధికారి ఒకరు, 'ప్రభూ! బండికి ప్రాణం లేదు కదా, అది సాక్ష్యం ఏ రకంగా చెప్ప గలుగుతుంది?' అని అడిగాడు.

సామంతరాజు గంభీరంగా చూసి, 'బండి మాత్రమే దొంగను చూసింది. అందువల్ల సాక్ష్యం చెప్పగలిగితే బండి మాత్రమే చెబుతుంది. అయినా ఇంత మంది ప్రజలు గుమిగూడి ఉంటే బండి సాక్ష్యం చెప్పదేమో,' అంటూ ప్రజలవైపు తిరిగి, 'మీరంతా వారి వారిండ్లకు తిరిగి వెళ్లి మీకు వీలైనన్ని తాజా మామిడి పండ్లతో వెనక్కి రండి!' అన్నాడు.

ప్రజలు ఈసారి మరింత ఆశ్చర్యపడి, సామంతరాజు పట్ల తమకున్న గౌరవాభి మానాలతో తమ ఇండ్లకు తిరిగిపోయారు. తమ కంటికి తాజాగా ఉన్నట్లు తోచిన మామిడిపండ్లను కొని కొన్ని గంటల తేడాలో న్యాయవిచారణా స్థలం చేరుకున్నారు.

మామిడి పండ్లను సామంతరాజు నేల మీద పరచివుంచమని కోరాడు. పండ్లు తెచ్చినవారు ఆయన చెప్పిన సూచనను పాటించారు.

సామంతరాజు ఈ పర్యాయం రైతుతో, 'ఈ మామిడి పండ్లలో నీవు తెచ్చిన వాటిని

గుర్తుపట్టగలవా!' అన్నాడు. రైతుకు తన కర్తవ్యం గుర్తొచ్చింది. అతడు మామిడి పండ్లను పరిశీలించి తాను బుట్టలో తీసుకు వచ్చిన పండ్లను చాలా సులువుగా గుర్తించాడు. వాటిని ఒక పక్కకు చేర్చాడు.

సామంతరాజుకు రైతు చేసిన పండ్ల ఎంపిక నమ్మకం కలిగించింది. అతడు అబద్ధమాడే మనిషి కాదు. పరాయి సొమ్ముకు ఆశపడడు. అతడి పండ్లను ఎత్తుకుపోయిన దొంగ వెంటవెంటనే వాటిని ఏదో ధరకు అమ్మి సొమ్ము చేసుకున్నాడు.

పండ్లను తెచ్చిన వారిని వారికి పండ్లు ఎవరు అమ్మారో అతడి ఆనవాళ్ల గురించి అడిగి తెలుసుకున్నాడు సామంతరాజు. రైతు ఎంచిన పండ్లు అమ్మినవాడు ఒకే వ్యక్తి అని మాత్రం సామంతరాజుకు అర్థమయ్యింది.

పైగా పండ్లను కొన్న ప్రజలు, 'అతడు ఎప్పుడూ మామిడిపండ్లు అమ్మే వాడి లాగా కనిపించలేదు.

అతడి భుజం మీద ఎడ్లను అదిలించే కొరడా వంటి వస్తువు ఉంది. మామిడి పండ్లను కొనేవారిని ఎడ్లను అదిలించినట్టు అతి హీనంగా బెదిరిస్తున్నాడు ప్రభూ!' అన్నారు.

సామంత రాజుకి ఉన్న సందేహం కూడా అదే! మామిడిపండ్లను అతడు తప్ప వేరెవ్వరూ ఎత్తుకుపోయే అవకాశం లేదు. తన ఎడ్లబండి వద్ద బండివాడు వేచివున్న సమయంలోనే రైతు తన పండ్ల బుట్టతో వస్తూ కనిపించాడు. బండిచాటున వేచి ఉండి సమయం చూసుకుని ఎత్తుకు పోయాడు. బండివాడిని పట్టి బంధించడం సామంతరాజుకు అట్టే కష్టం కాలేదు.

బండివాడు పశ్చాత్తాపంతో, 'నా ఎడ్ల బండికి తగినంత గిరాకీ లేకపోవడంతో ఆకలికి తట్టుకోలేక దొంగతనం చేశాను!' అన్నాడు.

సామంతరాజు అతడికి తగిన పని ఇప్పించి ఆదుకున్నాడు. రైతు తన పండ్లు మరోసారి అమ్మకానికి పెట్టాడు.



# What's your favourite Ekdum Fresh moment?




It can be a quick dip in the ocean or a dive into the swimming pool or just a cold splash of water. Whatever it is, send us a photo of you or your friends enjoying your favourite Ekdum Fresh moment. And three of the coolest and whackiest photographs will be featured in Chandamama's April issue. All three will also win a year's supply of Bubbaloo Cool Mint. So, go on, show everyone your way of getting Ekdum Fresh.




# శిథిలాలయం - 10

(సవరజాతి వాళ్లను గాయపరిచి ఎలుగుబంటి అరణ్యంలోకి పారిపోసాగింది. కాని శిఖిముఖీ, నాగుమల్లీ దాన్ని కొంత పోరు జరిగాక చంపారు. ఆ సమయంలో కొండ మీది నుంచి పూజారి కంఠం వినిపించింది. మరుక్షణంలో ఒక మానవాకారం ఎగురుతున్న పక్షిలా చేతులు చాచి చెట్ల కొమ్మల మీదుగా కిందికి రాసాగింది. తరవాత-)

చెట్ల కొమ్మల్లోంచి తమకేసి వస్తున్న వింత ఆకారాన్ని చూసిన, శిఖిముఖీ, నాగుమల్లులు చాలా ఆశ్చర్యం పొందారు. ఆ ఆకారం చూడటానికి మామూలు మనిషి లాగే ఉంది. కాని, పక్షిలా గాల్లో తేలియాడుతూ కిందకు దిగి రావటం వాళ్లిద్దరికీ కొంత భయాన్ని కూడా కలిగించింది. ఇది శిథిలాలయ పూజారి తన మంత్ర ప్రభావంతో కల్పించిన పక్షి మనిషేమో అనుకున్నాడు శిఖిముఖి.

కాని, అంతలోనే అతడి అనుమానం పటాపంచలైంది. ఆ వింతమనిషి కాళ్లూ చేతులూ ఊపుతూ భూమికి పది పన్నెండడుగుల ఎత్తులోకి వచ్చేసరికి, అతడి నడుముకు ఒక బలమైన మోకు కట్టి ఉన్నట్లు శిఖిముఖి చూశాడు. అంటే, పూజారి కొండమీద ఉండి ఈ మనిషి నడుముకు తాడు కట్టి చెట్లల్లోంచి తమ ముందుకు జారుస్తున్నాడన్నమాట!

ఈ సంశయం కల్గగానే శిఖిముఖి పెద్దగా నవ్వి, ''నాగుమల్లితో, చూశావా ఆ శిథిలాలయ పూజారి మంత్రశక్తులు ఎంత మహత్తరమైనవో? పాపం మీ అయ్య అమాయకంగా అతడి దొంగ మాటలు నమ్మి, అనవసరంగా మాతో విరోధం తెచ్చుకున్నాడు,'' అన్నాడు.

దాసరి సుబ్రహ్మణ్యం

ఆ మాటలకు నాగుమల్లి కోపం తెచ్చు కుని, ''మీ శబరవాళ్లు తెలివిమంతులూ, మా సవరలు అమాయకులూ అనా నీవు అనేది? అందరూ మందబుద్ధులే! అసలు కావాలని మాతో విరోధం పెట్టుకున్నది, మీ జాతివాళ్లు, మా అయ్యసంగతి..'' అంటూ ఏమో చెప్పబోయేంతలో పక్షి మనిషి దభీ మంటూ కింద పడ్డాడు. వాడి నడుముకు కట్టి ఉన్న తాడు తెగిపోయింది.

నిలువునా నేలమీద పడిపోయిన పక్షి మనిషిని శిఖిముఖీ, నాగుమల్లీ పట్టుకుని కదిలించి చూశారు. కాని, వాడు శవంలా కొంచెం సేపు బిర్రబిగుసుకు పోయి, హఠాత్తుగా ప్రాణం వచ్చినవాడల్లే ఎగిరి గంతేసి నిలబెడుతూ, ''జై పూజారి దేవా!'' అంటూ పెద్దగా కేక పెట్టాడు.

''ఆ పూజారి దేవుడు కాదురా, దయ్యం! ఇంతకీ నీవెవడివి? ఆ దుర్మార్గుడి బంటువా? చెప్పు,'' అంటూ శిఖిముఖి వాడి మెడ పట్టుకుని ఊపాడు. ''నేను గండభేరుండ పక్షి జాతి వాణ్ణి. చుక్కల కంటా ఎగురగలను, ఈ భూ ప్రపంచాన్ని క్షణ కాలంలో చుట్టి రాగలను,'' అంటూ వాడు గణాచారిలా ఊగి పోసాగాడు.

''వీడేదో మాంచి తాగిన మైకంలో ఉన్నాడు. వీడి నుంచి మనం పూజారి సందేశం వినటం ఎలా సాధ్యం?'' అంటూ శిఖిముఖి వాణ్ణి భుజాలు పట్టుకుని ఒక్క తోపు తోశాడు. ఆ తోపుకు వాడు పోయి ఒక చెట్టు బోదెకు కరుచుకుని, మెల్లిగా కూనిరాగాలు తీయసాగాడు.




అప్పటి వరకూ జరుగుతున్నదంతా పరీక్షగా చూస్తున్న నాగుమల్లి చప్పున పక్షి దగ్గిరకు పోయి, ఈటె తిప్పి వాడి భుజాన పొడుస్తూ, ''నీవు సవరజాతి వాడివి కాదా? నీది తిమ్మ గూడెమే కదా? గండుపోతు తెలుసా?'' అని ప్రశ్నించింది.

గండుపోతు అన్న పేరు వింటూనే వాడు అదిరిపడి ''సవర గండుపోతా? అతడికి చావు తప్పదు. పూజారి దేవుడికి కోపం తెప్పించాడు. చూస్తూండు. రెండు మూడు రోజుల్లో పూజారి దేవుడు పంపే గండభేరుండం అతణ్ణి కోడి పిల్ల కింద తన్నుకు పోయి ఏ కొండ శిఖరానో పెట్టు కుని పొడుచుకు తినేస్తుంది,'' అన్నాడు.

''ఈ తిక్క తిక్క మాటలు కట్టి పెట్టు. నీవు తిమ్మగూడెం వాడివి, నాకు తెలుసు.




నేను సవరపెద్ద గండుపోతు కూతుర్ని, నాగుమల్లిని, నీ పేరేమిటి?'' అంటూ నాగుమల్లి ఈటె కర్రతో వాడి వెన్నుమీద బలంగా కొట్టింది.

ఆ దెబ్బతో వాడికి తిక్క సగం దిగిపో యింది. వాడు చప్పున తలతిప్పి ''నాగు మల్లివా? చెప్పవేం? నిన్ను పూజారి దేవుడు మహారాణిని చేస్తానంటున్నాడు.. నా పేరా? పాత పేరు ఏదో గుర్తు లేదు. పూజారి దేవుడు పిలిచే పేరు సవర భేరుండం,'' అన్నాడు.

''నువ్వు సవర భేరుండానివి కాదు. చవట భేరుండానివి. ఆ దుర్మార్గుడేదో మందుమాకులు ప్రయోగించి నీ మతి చెడగొట్టినట్లుంది. లేకపోతే విప్పసారా అతిగా తాగి ఉంటావు. అందుకే ఇంత సేపటి నుంచి పిచ్చి పిచ్చిగా మాట్లాడు తున్నావు. నీ కైపు దించి నిన్నిప్పుడే మామూలు మనిషిగా చేస్తాను,'' అంటూ శిఖిముఖి, భేరుండాన్ని నడుం పట్టుకు ఎత్తి భుజాన వేసుకుని, దాపుల ఉన్న సెలయేటి దగ్గిరకు పరుగుపరుగున పోయి, విసిరి పడవేశాడు.

నీళ్లలో పడుతూనే భేరుండం పెద్దగా ఓ చావుకేక పెట్టాడు. అతడికి తాను నీటి ప్రవాహాన పడి కొట్టుకు పోయి ఏ రాతికో తల పగిలి చస్తానన్న భయం కలిగింది. శిఖిముఖి అతణ్ణి నీటివాలు వెంట కొట్టుకు పోకుండా పట్టుకుని, తలను నీటిలో ముంచుతూ, ''ఈ దెబ్బతో నీ మత్తు వదులుతుంది, తిరిగీ మనిషివవుతావు.'' అన్నాడు పళ్లు కొరుకుతూ.

శిఖిముఖి వాణ్ణి ఆ విధంగా నాలుగైదు సార్లు నీటిలో ముంచి ఎత్తేసరికి భేరుండం ప్రాణభయంతో తల్లడిల్లిపోతూ, ''చంపక నన్ను మహారాజా! పూజారి దేవుడు పంపిన సందేశం వినండి, ఆ పటం చూడండి. మహారాణి ఎక్కడ? కాపాడు, రక్షించు, మహారాణీ!'' అంటూ అరిచాడు.

సెలయేటి ఒడ్డున నిలబడి ఈ గొడ వంతా చూస్తున్న నాగుమల్లి, భేరుండం మాటలకు విరగబడి నవ్వుతూ, ''శిఖీ వాణ్ణి చంపకు. నీ వైద్యంతో వాడికి ఉన్న కాస్త మతి కూడా పోయినట్లుంది. ఒడ్డున పడెయ్యి,'' అన్నది.

శిఖిముఖి ఆ మాటలతో కాస్త శాంతించి, గండభేరుండాన్ని నీటిలో నుంచి పైకెత్తి

ఒడ్డుకు గిరవాటు వేశాడు. వాడు పడ్డ చోటునే ఆయాస పడుతూ లేచి కూర్చుని, ''నన్ను దయ తలచండి. ఆకాశంలో ఎంతో దూరం నుంచి ఎగిరి వచ్చిన ఆయాసం, శ్రమా వల్ల ఏదేదో మాట్లాడాను,'' అన్నాడు వగర్చుతూ.

''ఏదో పటం అన్నావే, ఏమిటది?'' అని ప్రశ్నించాడు శిఖిముఖి.

''ఆ.. మరిచాను, మహారాజా!'' అంటూ గండభేరుండం దుస్తుల్లో నుంచి గుండ్రంగా చుట్టి ఉన్న చర్మాన్నొకదాన్ని బయటకు తీసి, ''ఇది మంచు జింక చర్మం. విప్పి చూడండి. మీరు పాలించ బోయే రాజ్యపు సరిహద్దులూ, ఆ రాజ్యం లోని కొండలూ, నదులూ, అరణ్యాలూ అన్నీ ఉంటవి. మీరు వెంటనే బయలు దేరాలి. పూజారి దేవుడున్న చోటుకు తీసు కుపోతాను. తరవాత ఆయన మనందర్నీ ఆకాశమార్గాన బ్రహ్మపుత్రా నదీలోయ లకు ఎత్తుకు పోతారు,'' అన్నాడు సవర భేరుండం.

శిఖిముఖీ, నాగుమల్లీ అతడి మాట లేమీ పట్టించుకోలేదు. వాళ్లు గుండ్రంగా చుట్టి ఉన్న జింక చర్మాన్ని విప్పి, దాని మీద రంగుల్లో చిత్రించి ఉన్న అపూర్వ దృశ్యా లను చూస్తున్నారు. అందులో ఒక చోట శిథిలాలయం చిత్రించబడి ఉన్నది. దాని పక్కగా ఒక మహానదీ, కొండలూ, అర ణ్యాలూ చిత్రితమయాయి. దూరంగా మంచుతో కప్పబడిన హిమాలయ పర్వ తాలు కనిపిస్తున్నాయి.




శిఖిముఖీ, నాగుమల్లీ ఆ దృశ్యాలు చూస్తూ మైమరిచారు. వారినేదో అదృశ్య శక్తి ఒకటి ఆ సుందర ప్రాంతాలకు ఆహ్వానిస్తు న్నట్లుగా తోచింది.

''శిఖీ! మనం ఈ బొమ్మలో ఉన్న హిమాలయ ప్రాంతాలకు వెళదామా? పూజారి చెప్పే రాజూ, రాణీ మాటలు నేను నమ్మను. కాని, ఊరికే ఒకసారి అతడి వెంట వెళ్లి, అద్భుతంగా ఉన్న ఆ కొండలూ అవీ చూసి వద్దాం,'' అన్నది నాగుమల్లి.

శిఖిముఖి, ఆమె కేసి చూశాడు. నాగు మల్లి కళ్లింత చేసుకుని, జింకచర్మం మీద చిత్రించబడ్డ దృశ్యాల కేసి చూస్తూ ఆనంద పారవశ్యంలో మునకలు వేస్తున్నది. శిఖి ముఖి ఏదో ప్రమాదాన్ని శంకించిన వాడిలా కనుబొమలు పైకెత్తి, తలాడిస్తూ, నాగు




మల్లి భుజం మీద చేయి వేసి ''మల్లీ నువ్వీ లోకంలోనే ఉన్నావా లేక పూజారి మంత్ర ప్రభావానికి కట్టుబడిపోయావా?'' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నతో నాగుమల్లి ఉలిక్కి పడి, ''భేరుండానికి లాగే నాకూ మతిపోయినట్లుంది. లేకపోతే ఆ దుర్మార్గుడైన పూజారి వెంట ఆ బ్రహ్మపుత్రానది లోయలకేసి వెళ్లటం ఏమిటి?'' అన్నది నొచ్చుకున్నట్లు.

''నేనూ అదే అడగబోతున్నాను. వాడు మన శత్రువు..'' అంటూ శిఖిముఖి ఆగి, సవర భేరుండం కేసి తల తిప్పి, ''నువ్వు ఇక్కడే ఉండు, నీ వెంట ఆ పూజారి దేవుడి దగ్గిర కొస్తాం,'' అని చెప్పి, నాగుమల్లిని కొంచెం దూరంగా తీసుకుపోయి, ''ఆ శిధిలాలయ పూజారిని పట్టుకునేందుకు ఇదొక అవకాశం.

వాడు ఈ ప్రాంతాల్లో చేసిన ఘోరాలు అన్నీ ఇన్నీ కావు. గండభేరుండం మాటలు నమ్మినట్లు నటించి, వాడి వెంట పూజారి దగ్గిరకు వెళదామా? ఒకసారి ఆ దుష్టుడు మన కంటబడితే, వాణ్ణి పట్టుకు బంధించడం ఏమంత కష్టం కాదు,'' అని చెప్పాడు.

నాగుమల్లి అందుకు సంతోషంగా అంగీకరించింది. ఆ వెంటనే శిఖిముఖి, గండభేరుండాన్ని సమీపించి, ''ఇక పద మీ పూజారి దేవుడి దగ్గిరకు దారితియ్యి,'' అన్నాడు.

గండభేరుండం ఆ మాటలు వింటూనే పరవశుడై పోయినట్లు గంతులు వేస్తూ, ''రండి, రండి. కాబోయే మహారాజూ, మహారాణీలను పూజారి దేవుడికి పరిచయం చేయటం కన్న నాక్కావలిసిందేమున్నది? రాజ్యం వచ్చింతర్వాత, ఈ సవర భేరుండాన్ని మాత్రం మరవకండి,'' అని చెట్లల్లోంచి కొండ మీదికి దారి తీశాడు.

ఆ కొండ ప్రదేశమంతా పెద్ద పెద్ద వృక్షాలతో కప్పుకుపోయి ఉన్నది. భేరుండం ఆ ప్రాంతమంతా క్షుణ్ణంగా తెలిసిన వాడి లాగా గబగబా నడవసాగాడు. శిఖిముఖీ, నాగుమల్లీ చుట్టూ పరికించి చూస్తూ, ఆయుధాలు జాగ్రత్తగా పట్టుకుని వాణ్ణి అనుసరించారు.

ఒక పావుగంట గడిచింది. ఆ సరికి వాళ్లు కొండ మీదికి చాలా దూరం ఎక్కారు.

అప్పుడు భేరుండం ఏవో గుర్తుల కోసం చూస్తున్న వాడిలా తల అటూ ఇటూ తిప్పుతూ మెల్లిగా నడుస్తున్నాడు. శిఖి ముఖీ, నాగుమల్లులు ఒక మహా వృక్షం బోదెను చుట్టి ముందుకు పోయేంతలో, ''నా బిడ్డల్లారా! వస్తున్నారా? అహ్హహ్హా!'' అన్న శిథిలాలయ పూజారి వికృత కంఠ ధ్వని వినిపించింది.

ఇద్దరూ గతుక్కుమని తలలెత్తి పైకి చూశారు. వాళ్ల కళ్లకు భయం కొల్పే అద్భుత దృశ్యం ఒకటి కనిపించింది. వాళ్లు కింద అరణ్యంలో చంపిన ఎలుగు బంటు చెట్లకొమ్మల మీదుగా గాలిలో తేలుతూ పైకి పోతున్నది.

''శిఖీ! అది మనం చంపిన ఎలుగే! మెడ ఒక పక్కకు వేలాడదీసి ఉన్నది కనబడటం లేదా?'' అన్నది నాగుమల్లి ఆశ్చర్యపడుతూ.

''తెలుస్తూనే ఉన్నది. దేని సాయంతో శిథిలాలయ పూజారి దాన్ని పైకి లాగుతు న్నాడేమో అర్థం కావటం లేదు. ఓహో, భేరుండాన్ని మన ముందు దించినట్టు..'' అని శిఖిముఖి ఏదో చెప్పబోయేంతలో పైనుంచి పూజారి కంచుకంఠం గణగణ మంటూ మోగింది.

''అవి తాళ్లనుకుంటున్నావా? కాదు, కర్మపాశాలు! వాటికి బద్ధుడయ్యే, భల్లూ కేశ్వరుడు నా దగ్గిరకొస్తున్నాడు, మీరు నా దగ్గిర కొస్తున్నారు,''

ఆ మరుక్షణంలో జుయ్ మంటూ రెండు మూడు బాణాలు చెట్లకొమ్మల మీదుగా పైగి దూసుకు పోయినై. దానితో పాటే విక్రమకేసరి గొంతు కూడా వినిపిం చింది. ''శిఖీ! మల్లీ! ఆ పూజారి ఉన్న గుహ తెలిసింది. చుట్టుముట్టుదాం. ఇదుగో వస్తున్నాను.''

శిఖిముఖీ, నాగుమల్లీ ఆ కంఠధ్వని వినవచ్చిన వైపుకు తలలు తిప్పి చూశారు. విక్రమకేసరి వేగంగా వాళ్లకేసి పరిగెత్తుకు వస్తున్నాడు. (ఇంకా ఉంది)





# అనుభవం

రామభద్రయ్యకి ఆ చుట్టుపక్కల ముప్పయి నలభై గ్రామాల్లో ఘనవైద్యుడని పేరు. ఎటువంటి రోగాన్నయినా సునాయాసంగా తగ్గిస్తాడని గొప్పగా చెప్పుకుంటారు.

రామభద్రయ్య ముందుచూపుతో తన కొడుకు కేశవుడికి తన వైద్యవిద్యను, అందులో మెళకువలను నేర్పి అతణ్ణి తనంతటివాడిగా తీర్చిదిద్దాడు.

రామభద్రయ్య ఊరిలో లేని సమయాల్లో కేశవుడు రోగులకు వైద్యం చేస్తూండేవాడు. అతని హస్తవాసి మంచిదని, తండ్రిని మించిన వైద్యుడని చాలా కొద్ది కాలంలోనే పేరు తెచ్చుకున్నాడు కేశవుడు.

ఉన్నట్టుండి రామభద్రయ్యకు సుస్తీ చేసింది. ఆయన కొడుకును పిలిచి రోగులకు ఆపత్కాలంలో ప్రాణరక్షణ కొరకు ఏయే మందులు ఎంత మోతాదుల్లో ఇవ్వాలో వివరంగా చెప్పి కన్ను మూశాడు.

కేశవుడు తండ్రి స్థానంలో సమర్థవంతంగా వైద్యం చేస్తూ వచ్చాడు. అతని వైద్యం గురించి గతంలోనే ప్రచారం జరిగినందున తండ్రిపేరును సుస్థిరం చేశాడు కేశవుడు.

కేశవుని వద్ద లేహ్యాలు నూరటం, గుళికలు తయారు చేయటం, మూలికలు పొడి చేయటం కోసమని శివుడు అనేవాడు పనిచేస్తుండేవాడు. కేశవుడు ఏయే వ్యాధులకు ఏయే మందులు ఎంత మోతాదులో ఇస్తాడో బాగా ఆకళింపు చేసుకున్నాడు శివుడు. మూలికా వైద్యం గురించి కూడా బాగా అనుభవం సాధించాడు.

శివుడికి తానే స్వంతంగా ఒక వైద్యశాల నడపాలనే కోరిక పుట్టింది. రోజురోజుకీ ఆ

బొమ్మిడి అచ్చారావు



రోగులకు గాని, అతని ఆదాయానికి గాని ఎలాంటి కొరతా లేదు.

శివుడు తను నేరుగా ఆసుపత్రి నడుపుతున్న విషయం ముందుగా కేశవుడికి చెప్పక పోయినా కనీసం అతడిచేత ప్రారంభోత్సవమయినా చేయించలేదు. అయినా శివుడి ఇవేమీ పట్టించుకోలేదు.

ఓ రోజు శివుడి దగ్గరకు తీవ్రమైన జ్వరంతో బాధపడుతున్న ఓ రోగిని తీసుకువచ్చాడు. శివుడు జ్వరం తగ్గటానికని గుళికలు ఇచ్చాడు. నుదుటి మీద తడి గుడ్డ పట్టీ వేశాడు.

అతను గుళికలు వేసిన వెంటనే, రోగి ఒక్కసారిగా కళ్లు తేలవేసి కాళ్లు చేతులు కొట్టుకోవడం మొదలెట్టారు. దానితో రోగి బంధువులు ఒక్కసారిగా గొల్లుమన్నారు. ఆడవాళ్లయితే శోకాలు ఆరంభించారు.

శివుడికి కాళ్లు చేతులు ఆడలేదు. తాను జ్వరానికి ఇచ్చే గుళికలే ఇచ్చాడు. కాని రోగి పరిస్థితి చూస్తుంటే విషమిస్తున్నట్లు గ్రహించాడు. అటువంటి పరిస్థితిలో విరుగుడుకు ఏ మందు వాడాలో అతనికి తెలియదు.

వెంటనే కేశవుడి దగ్గరకు పరుగెత్తి అతని కాళ్లమీద పడి పరిస్థితిని వివరించాడు శివుడు. వెంటనే కేశవుడు విరుగుడుకు అవసరమైన మందులు సంచీలోవేసుకుని వాయువేగంతో రోగి దగ్గరకు బయలు దేరాడు.

వ్యాధి లక్షణాలు చూడగానే, సంచీలో నుంచి ఏవో మాత్రలు తీసి రోగి నోటిలోవేసి

కోరిక మరింత బలపడుతూ వచ్చింది. శివుడు ఓ రోజు కేశవుడికి మాట మాత్రంగానైనా చెప్పకుండా విడిగా వెళ్లిపోయి వైద్యశాలను ప్రారంభించి వైద్యం చేయడం మొదలెట్టాడు.

అప్పటికే వైద్యంలో కేశవుడి దగ్గిర గడించిన పరిజ్ఞానంతో బాగానే రాణించాడు.

రోగులు శివుడి దగ్గరకు బాగానే వస్తూ పోతుండేవారు.అతని ఆదాయం కూడా బాగానే ఉండేది. తనకు తీరిక లేక మందులు నూరటానికి తన వద్ద ఒక పనివాడిని కూడా పెట్టుకున్నాడు శివుడు.

కేశవుడికి ఎప్పటికప్పుడు శివుడి సంగతులు తెలుస్తూనే ఉన్నాయి. శివుడు వేరే వైద్యం చేస్తున్నా కేశవుడి వద్దకొచ్చే

నీళ్లు తాగించారు. రోగి ఆ మందును గుటక వేయగానే గుణం కనిపించింది. కాళ్లు చేతులు కొట్టుకోవడం ఆగిపోయింది. రోగి కళ్లు తెరిచి చూశాడు.

''ఫరవాలేదు. ప్రాణభయం లేదు. కొంతసేపు ఇక్కడే ఉంచి ఈ మాత్రలు కూడా మింగించి, ఆ తరవాత తీసుకు వెళ్లండి,'' అని చెప్పి కేశవుడు రోగి బంధు వులకు ఏవో మాత్రలు ఇచ్చి తన ఇంటికి బయలుదేరాడు.

రోగి బంధువులు రెండు చేతులూ జోడించి కేశవుడికి పడి పడి దణ్ణాలు పెట్టారు. అదే సమయంలో శివుడి పట్ల వ్యతిరేకత వ్యక్తం చేశారు.

శివుడు, కేశవుడికి నమస్కరించి, ''పెద్ద గండం గడిచింది గురువుగారూ! తమరే సమయానికి వచ్చి వైద్యం చేయకపోయి ఉంటే ఈ జనం నన్ను కొట్టి చంపేసే వాళ్లు,'' అన్నాడు.

కేశవుడు నవ్వి, ''ఏ రోగానికి ఏ మందు వేయాలో తెలిసినంత మాత్రాన సరిపోదు. ఆ మందు వికటిస్తే, రోగికి వెంటనే ప్రాణ రక్షణకు ఏ మందు వాడాలో తెలియదు. అది కూడా ఎంత మోతాదు ఇవ్వాలో తెలిసి ఉండాలి.''

''ఒకే ప్రాణరక్షణ మందు అన్ని రోగాలకూ వాడకూడదు. ఇదంతా అను భవం మీద వస్తుంది. నువు ఏ రోగానికి ఏ మందు వాడతారో చూసి నేర్చుకున్నావు గాని, ఆ మందు వికటిస్తే ఏం చేయాలో తెలియదు. మిడిమిడి జ్ఞానం వైద్యం విషయంలో చాలా ప్రమాదం... అంతే కాదు, మన దగ్గరకు వచ్చిన రోగి వద్ద మన కివ్వటానికి డబ్బులు లేకపోయినా, ధైర్యం చేసి రోగిని రక్షించాలి. ధనసంపాదన మాత్రమే ముఖ్యం కాదు. మంచి వైద్యుడనే పేరు గడించడం కూడా చాలా ముఖ్యం,'' అన్నాడు.

శివుడికి తానెంత పొరపాటు చేశాడో అర్థమయింది. ఆ క్షణమే తన వైద్యశాలను ఎత్తేసి, తిరిగి కేశవుడి దగ్గర మందులు తయారు చేయడానికి కుదురుకున్నాడు.



ప్రియమైన బాల పాఠకులారా,

పిల్లల వినిపించని గళాలను మీ ముందుకు తీసుకువస్తామంటూ మేం చేసిన వాగ్దానంలో భాగంగా ఈ నెలలో ''యూత్ స్పీక్''ని మీకు పరిచయం చేస్తున్నాము. ఇది తూర్పు భారత దేశంలోని పశ్చిమ బెంగాల్ రాష్ట్రం నుంచి వెలువడుతున్న వార్తాపత్రిక. ప్రభుత్వేతర సంస్థ శాన్‌లాప్ మద్దతు పలుకుతున్న బాల విలేఖరుల వాణిని యూత్‌స్పీక్ ఒడిసి పట్టుకుంటుంది.

అభినందనలతో,
మీ దీదీ



## విముక్తి అంటే ఏమిటి?

స్వాతంత్ర్యం అనే పదం వినగానే 200 సంవత్సరాలుగా మన పరాధీన చరిత్రే మనందరికీ గుర్తుకొస్తుంది. అన్నిటికంటే మించి భారతీయులపై బ్రిటిష్ వారు సాగించిన అమానుష అణచివేత మనలను రగిలిస్తుంది. తమ స్వంత సౌభాగ్యం కోసం వీళ్లు భారత్‌ను కొల్లగొట్టారు.



తర్వాత ఈ సుదీర్ఘ నియంతృత్వానికి, పీడనకు వ్యతిరేకంగా భారతీయులు ఐక్యంగా నిలబడి తిరుగుబాటు చేయడంతో స్వాతంత్ర్యం సిద్ధించింది. స్వాతంత్ర్య సాధనకోసం జరిగిన పోరాటంలో అనేకమంది అసువులు బాశారు. విముక్తి సాధించడం అంత సులభం కాదని ఇది మనకు గుర్తు చేస్తుంటుంది.

1947 ఆగస్ట్ 15 భారతీయులు స్వర్ణాక్షరాలతో లిఖించ దగిన రోజు. ఇది మన స్వాతంత్ర్యదినం. 200 సంవత్సరాల క్రితం బ్రిటన్‌కు చెందిన ఈస్టిండియా కంపెనీ వ్యాపారంకోసం భారతగడ్డపై కాలు మోపింది.

కాలక్రమంలో ఈ కంపెనీ యజమానులు భారతదేశ పాలకులుగా అవతరించి తీవ్రమైన అణచివేతను మొదలెట్టారు. సుదీర్ఘ పోరాటం తర్వాత మనం 1947 ఆగస్ట్ 15న స్వాతంత్ర్యం సాధించుకున్నాము.

అయితే ఈరోజు వ్యక్తి స్వాతంత్ర్యం, దేశ స్వాతంత్ర్యం రెండూ ఒకటేనా లేదా వేరువేరా అనే అంశంపై అన్వేషణ జరుపుతున్నాము. ఇంటర్వ్యూ ద్వారా విముక్తి అర్థాన్ని సమాజం లోని ప్రతి రంగానికి వర్తించేలా మేము ప్రయత్నిస్తున్నాము.

విముక్తి భావనకు సంబంధించి విభిన్న వ్యక్తులకు విభిన్న అర్థాలతో విముక్తిని రూపొందించాల్సి ఉందనే డిమాండ్ సర్వత్రా వినిపిస్తుండటం గమనించాము. మన హక్కులు, డిమాండ్లు విముక్తి పొందాయా అనే అంశంపై ప్రతిసందర్భంలోనూ విభేదాలు చోటు చేసుకుంటున్నాయి.



ఒక ఎన్జీవో వాలంటీర్ అభిప్రాయం ప్రకారం విముక్తి అంటే అన్నిటికీ లైసెన్స్ అని అర్థం కాదు. మన ఇచ్ఛ ప్రకారం వ్యవహరించే స్వాతంత్ర్యాన్ని విముక్తి మంజూరు చేయదు. నిజంగా నేను విముక్తి పొందాను. కాని భావాలు, వయస్సు నుంచి విముక్తి పొందలేదు. పరిష్కరించలేని కనిపించని అడ్డంకులేవో ప్రతి సందర్భంలోనూ ఎదురవు

తూనే ఉంటున్నాయి. ఇతరుల జీవితాలను ధ్వంసం చేయడం మన విముక్తికి అర్థం కాదని మనం గమనించాలి. నిజం చెప్పాలంటే మనం పుస్తకాలు, కేలండర్లలో మాత్రమే విముక్తి చెందాము.

ఒక పాఠశాల ఉపాధ్యాయుడి దృష్టికోణంలో అధికారం మారడం లేదా చేతులు మారడమే విముక్తికి అర్థంగా ఉంటోంది.

ఒక కళాశాల మిత్రుడు జీవితంలో తనకు ఎటువంటి వ్యతిరేకతా ఉండకూడదని అభిప్రాయం వ్యక్తపరిచాడు. ''జీవితం సాఫీగా గడిచిపోవాలి. నాకు బైక్ కావాలని మా నాన్నను అడుగుతాను, ఆయన వ్యతిరేకిస్తే తీవ్రంగా విసుక్కుంటాను.''

పొరుగింటి సోదరి తాను పెద్ద కాగానే మొబైల్ పొందానని చెప్పింది.

మెరుగైన జీవితం గడపడం మీ హక్కు. మీ శారీరక, మానసిక అవసరాలను తీర్చడానికి ఇది అవసరం. దీన్ని మీ కుటుంబం మీకు అందించలేకపోతే ప్రభుత్వం సహాయం చేయవలసి ఉంటుంది.

మీకు చదువుకునే హక్కు ఉంది. ప్రాథమిక విద్య వరకు మీకు ఉచితంగా అందించాలి.



విద్య మీ వ్యక్తిత్వ వికాసాన్ని, నైపుణ్యాలను వీలైనంత సమగ్రంగా మెరుగుపర్చాలి. అది మీ తల్లిదండ్రులను, మీ సంస్కృతిని, ఇతరుల సంస్కృతిని మీరు గౌరవించడాన్ని ప్రోత్సహించాలి.




Liked what you read?
Send your comments / queries to
YouthSpeak, 38 B, Mahanirban Road,
Kolkata- 700 029
Email: sanlaap@rediffmail.com
Tel: 033-2464 95 96










An initiative of Sanlaap, YPP and ECPAT
supported by
UNICEF

Send us your feedback!
CHANDAMAMA INDIA LTD.,
B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
Phone : +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com




# సుతిమెత్తని మొట్టికాయలు

కుందన గిరి గ్రామంలో ఒకప్పుడు సిద్ధ రాముడు అనే యువకుండేవాడు. వాడు ఆరేళ్ళ వయస్సులో ఉండగా, అంతుచిక్కని జబ్బు చేసి వాడి తల్లి మరణించింది. ఆ బెంగతో మంచం పట్టిన వాడి తండ్రి ఆరు నెలలు తిరిగేసరికల్లా కాలం చేసాడు.

అప్పటి నుండి వాడి బాగోగులు, వాడి మేనత్త సూరమ్మ, ఆమె భర్త శంకరయ్య చూసుకునే వారు. సిద్ధరాముడు కాస్త అమా యకుడు. కానీ మంచి వాడూ, కష్టించి పని చేసేవాడు. వాడికి భయం అన్నదే తెలియదు.

వాడి తల్లిదండ్రులు చనిపోయినప్పటి నుండి సిద్ధరాముణ్ణీ వాడి ఆస్థిపాస్తుల్నీ దగ్గ రుండి చూసుకునేందుకు సూరమ్మత్త, శంక రయ్య మామలు, వాళ్ళ ఊరు వదిలి కుందన గిరికి వచ్చేసారు. మొదట్లో సూరమ్మత్త సిద్ధ రాముణ్ణి బాగానే చూసుకునేది. సూరమ్మత్తకు సంతానం కలగలేదు. దాంతో క్రమంగా సిద్ధ రాముడి మీద తెలియకుండానే ఈర్ష్యా ద్వేషాలు పెంచుకుంది. ఇరుగు పొరుగు అమ్మ లక్కలు నీకెటూ పిల్లలు లేరు కదా సూరమ్మ! సిద్ధరాముడినే నీ కొడుకనుకో! అనటంతో సూరమ్మకి కడుపు మంట పెరిగి పోయేది.

దాంతో ఎవరూ చూడనప్పుడు సిద్ధ రాముడి నెత్తి మీద మొట్టికాయలు వేసేది. ఆ వంకా ఈ వంకా పెట్టి తెగ తిట్టేది. భార్యను సంతృప్తి పరచటానికి శంకరయ్య కూడా సిద్ధ రాముడిని ఈసడించి తిడుతూ ఉండేవాడు.

సిద్ధరాముడికి మాత్రం అత్త మామలంటే ఇష్టమూ, గౌరవమూ. తల్లిదండ్రులు లేని తనని, చిన్నప్పటి నుండీ వాళ్ళే గనక పెంచి పెద్ద చేయకపోయి ఉంటే తాను ఏమై పోయి ఉండే వాడో అనుకునే వాడు. వాళ్ళ మెప్పుకోసం ఇంటిపని, పెరటి తోట పని, పొలం పని చెప్పక ముందే చేసే వాడు. ఐతే రాను, రాను సూరమ్మ గయ్యాళితనం పెరిగిపోసాగింది. సిద్ధరాముడి నెత్తిమీద మొట్టటం సూరమ్మత్తకీ, తిట్టటం శంకరయ్య మామకీ అలవాటై పోయింది.

యాడ్ల ఆదిలక్ష్మి

దాంతో ఒక రోజు ఇదంతా తలచుకుని సిద్ధరాముడికి చాలా బాధ కలిగింది. పొలం నుండి ఇంటికి రా బుద్ధి కాలేదు. అడవి దారి పట్టి అలా నడుచుకు పోయాడు. సాయంకాలం అయ్యేసరికి ఓ సెలయేరు వద్దకు చేరాడు. నీటిలో కాళ్ళూ చేతులూ కడుక్కుని, దాహం తీర్చుకున్నాడు. ఒడ్డునే ఉన్న చింత చెట్టు క్రింద జారగిల పడ్డాడు. తన స్థితి తలుచుకుని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.




ఇంతలో చెట్టుపై నుండి భీకర శబ్దం వినిపించింది. వాడి చుట్టూ గులక రాళ్ళ వర్షం కురిసింది. ఒకట్రెండు రాళ్ళు వాడి మీద కూడా పడ్డాయి. శంకరం మామ కూడా, డబ్బాలో గులకరాళ్ళు వేసి గలగల లాడించినట్లుగా తనను తిడుతూ ఉంటాడు అనుకున్నాడు సిద్ధరాముడు.

అంతలో టపటప చింతకాయలు రాలి వాడి నెత్తి మీద పడ్డాయి. మేనత్త మొట్టికాయలు ఇలానే ఉంటాయి కదా అనుకునే సరికల్లా, అంత బాధలోనూ వాడికి నవ్వు వచ్చింది.

వెంటనే చెట్టు మీదినుండి గబిల్లున వాడి ముందు దూకిందో దయ్యం. పొట్టిగా లావుగా ఉన్న ఆ దయ్యం, సిద్ధరాముడిని భయపెట్టటానికా అన్నట్టు, వికృతంగా అరుస్తూ వింత చేష్టలు చేసింది.

మన వాడికి అసలే భయం తెలియదయ్యే! దాని వింత చేష్టలు వికృతపు కూతలు చూసి, ఫకాలున నవ్వాడు. అంత సేపు వాడిని భయపెట్టటానికి చిందులు తొక్కిన దయ్యం, ఆయాసంతో రొప్పుతూ ''ఒరే అబ్బి! నీకు భయం వేయటం లేదూ?'' అంది.

ఎందుకూ భయం? అన్నాడు సిద్ధరాముడు. ''నీ చుట్టూ రాళ్ళ వర్షం కురిపించాను. నెత్తి మీద చింతకాయలు కురిపించాను'' అంది దయ్యం గుడ్లురుముతూ.

''మా శంకరం మామ తిట్ల వాన, నీ రాళ్ళ వాన కంటే పెద్దది. ఇక నా నెత్తి మీద నువ్వు రాల్చిన చింతకాయలు, మా సూరమ్మత్త మొట్టికాయలతో పోల్చితే సుతారంగా ఉన్నాయి. వీటికే భయపడిపోతానా?'' అన్నాడు.

లావుపాటి పొట్టి దెయ్యం వాడి పక్కకు జరిగి ''ఒరే అబ్బీ! బ్రతికుండగా అందరికీ భయపడుతూ బ్రతికాను. చచ్చి దయ్యాన్నై, అందరినీ భయపెడుతూ సంతోషిస్తున్నాను. నాకు తారసిల్లిన వారందరూ నా చేష్టలకు భయపడి పుంజీలు తెంచుకు పారిపోయారు. నీ ధైర్యం చూసి ముచ్చటగా ఉందిరా అబ్బీ! నీ కథేంటో చెప్పు?'' అంది.

సిద్ధరాముడు తన కథంతా దానికి చెప్పుకున్నాడు. లావుపాటి పొట్టి దయ్యం ''ఒరే



అబ్బాయ్! నేనూ నీతో పాటు మీ ఇంటికి వస్తాను. సూరమ్మత్త, శంకరయ్య మామలకు బుద్ధి చెబుదాం. ఐతే నేను నీకు తప్ప ఎవరికీ కనబడను. అక్కడ సందర్భాన్ని బట్టీ, నేను ఏం చేస్తే నీకు మేలవుతుందో నాకు చెప్పు. నేనెవరికీ కనబడను కనుక, ప్రత్యక్షంగా నాతో చెప్పినట్లుగా కాకుండా, నేనేం చేయాలో అన్యాపదేశంగా చెప్పు!'' అంది.

సిద్ధరాముడు సరే అన్నాడు. ఇద్దరూ కలిసి ఇల్లు చేరారు. సూరమ్మత్త, సిద్ధరాముడిని చూడగానే కోపంతో చిందులు తొక్కింది. శంకరయ్య మామ ''పొద్దున్నుంచీ ఇంటికి రాకుండా ఎక్కడికి ఊరేగావు. అచ్చోసిన ఆంబోతులా ఊరి మీద పడి తిరగకపోతే పనీపాటా చక్కపెట్టవచ్చు కదా? బుద్ధి లేని గాడిదా!'' అంటూ తిట్లు లంకించుకున్నాడు.

శంకరయ్య మామ తిట్లు ఆపగానే ''అమ్మయ్యా! రాళ్ళవాన కురిసినట్లుంది మామయ్యా'' అన్నాడు సిద్ధరాముడు. లావు పాటి పొట్టి దయ్యానికి తనేం చేయాలో అర్థం అయిపోయిండి. అర చేతి మందాన ఇల్లంతా రాళ్ళవాన కురిపించింది. సూరమ్మత్త శంకరయ్య మామ నోరెళ్ళపెట్టారు.

సిద్ధరాముడు నవ్వుతూ ''ఓర్నాయనో! ఈ రాళ్ళన్నీ ఊడ్చి పారేయడానికి సూరమ్మత్త చేతిలో చీపుళ్ళెన్ని విరగాలో'' అన్నాడు. దిగ్భ్రాంతి చెందిన సూరమ్మ చీపురు చేతిలోకి తీసుకుని ఊడ్చబోయింది. అంతే! చీపురు కాస్తా విరిగికూర్చుంది. మరొక చీపురు తీసుకుంటే అదీ అంతే! భార్యాభర్తలిద్దరూ స్రాన్పడిపోయారు.

సిద్ధరాముడు ''బెదిరిపోకు అత్తా! ఎలా వచ్చిన రాళ్ళు అలాగే పోతాయిలే!'' అన్నాడు. వాడి ఉద్దేశం అర్థమైన దయ్యం, రాళ్ళన్నిటినీ మాయం చేసేసింది. అయోమయంలో పడిన సూరమ్మతో సిద్ధరాముడు ''అత్తా! ఆకలేస్తోంది. అన్నం పెట్టవూ?'' అన్నాడు. సూరమ్మ తలాడించి వంటింట్లోకి దారితీసింది. కాళ్ళూ చేతులూ కడుక్కుని వచ్చి సిద్ధరాముడు వంటింట్లో పీట వాల్చుకు కూర్చున్నాడు. అన్నం కూర వడ్డించిన కంచాన్ని వాడి ముందుపెట్టి, అలవాటుగా వాడి నెత్తి మీద ఒక మొట్టికాయ వేసింది సూరమ్మ.

సిద్ధరాముడు ''అత్తా! ఈ రోజేమిటి నీ మొట్టికాయ గట్టిగా కాక సుతిమెత్తగా ఉంది? నీ మెడలోనూ, చేతులకీ ఉన్న నూలు దారపు దండలంత మెత్తగా ఉంది'' అన్నాడు. కంగారుగా సూరమ్మ చేతులు చూసుకుంది. చేతులకి బంగారు గాజులకు బదులు నూలు దారపు దండలున్నాయి. మెడ తడిమి చూసుకుంటే చంద్రహారంతో సహా బంగారు నగలన్నీ నూలు దండలై పోయాయి. సూరమ్మకు స్పృహతప్పిపోయింది.

ఈ మాయంతా చేసిన లావుపాటి పొట్టి దయ్యం నిశ్శబ్దంగా నవ్వసాగింది. సూరమ్మ కేక విని శంకరయ్య పరిగెత్తుకు వచ్చాడు. పరిస్థితి అంతా చూసి సిద్ధరాముడి చేతులు పట్టుకుని ''రాముడూ! నువ్వుగానీ మాయ మంత్రాలు నేర్చుకున్నావేమిట్రా? బాబ్బాబు! మీ అత్తని మామూలు మనిషిని చేయరా. మాకు బుద్ధి వచ్చింది. నిన్నుప్రేమగా చూసుకుంటాము'' అన్నాడు.

దానికి సిద్ధరాముడు ''అత్తకీ, అత్త నగలకీ ఏమీ కాదులే మామయ్యా!'' అన్నాడు. నూలు నగలు మళ్ళీ బంగారు నగలుగా మారి పొయ్యాయి. సూరమ్మ లేచి కూర్చుని, బిత్తర చూపులు చూడసాగింది. శంకరయ్య కూడా సిద్ధరాముడిని బెదురుగా చూస్తున్నాడు.

సిద్ధరాముడు ''మరేం లేదు మామా! నేను పొలంగట్టు మీద కూర్చునుండగా ఒక దయ్యం కనిపించింది. నా కథంతా విని, మీరిద్దరూ, చెరుపు చేస్తే మీకూ చెరుపవుతుంది'' అని వరం ఇచ్చింది అని అన్నాడు.

దయ్యం అనే సరికల్లా శంకరయ్య గజగజ వణుకుతూ ''నాయన్నాయన! ఇంకెప్పుడూ నిన్ను తిట్టం! కొట్టం!'' అన్నాడు.సూరమ్మ మెల్లిగా కూడదీసుకుంటూ ''మరి మేమిద్దరమూ నీకు మంచి చేస్తే, మాకూ మంచి జరగాలనే వరాన్ని అడగకూడదూ ఆ దెయ్యాన్ని?'' అంది గొణుగుతున్నట్లుగా!

సిద్ధరాముడు ''నేనూ అదే అడిగానత్తా! దానికా దెయ్యం, నేను దెయ్యాన్ని, దెయ్యాలు చెడ్డవరాలే ఇస్తాయి. మంచి వరాలు కావాలంతే దేవుణ్ణి అడగాల్సిందే'' అంది అన్నాడు.

దానికి సూరమ్మత్త, శంకరయ్య మామ ''ఆ దెయ్యం గోల మనకెందుకులేరా! మనం మంచిగా ఉందాం!'' అన్నారు. సిద్ధరాముడు నవ్వుతూ తలూపాడు. ఎవరూ చూడకుండా లావుపాటి పొట్టి దయ్యానికి కృతజ్ఞత చెప్పాడు.

వాడి దగ్గర సెలవు పుచ్చుకుంటూ దయ్యం ''సిద్ధరాముడూ! నువ్వు అమాయకుడివి కాదు. మంచి వాడివి. ధైర్యస్తుడివి. పైగా తెలివిగల వాడివి. మీ అత్తకి నువ్వేసిన మొట్టికాయలు సుతిమెత్తనివి!'' అనేసి చక్కా పోయింది.

ఆనాటి నుండీ సూరమ్మ శంకరయ్యలు, సిద్ధరాముడిని కన్నకొడుకులా చూసుకున్నారు. మంచి పిల్లను చూసి పెళ్ళి చేసారు. సిద్ధరాముడు వారిని కన్నవారిలాగా ఆదరించాడు.





# స్వర్గ ప్రాప్తి

ధనగుప్త దంపతులకు విశ్వకేతుడు ఏకైక పుత్రుడు. విశ్వకేతుడు బాల్యం నుంచీ గొప్ప దైవ భక్తిపరుడు. తల్లిదండ్రులు అతన్ని ఏ విషయంలోనూ నిర్బంధించక, దేవుడి పూజ కోసం వదిలేశారు. అతన్ని డబ్బు సంపాదించ మని కానీ, కుటుంబ బాధ్యతలు నిర్వర్తిం చమని కానీ, వాళ్లేనాడూ పోరు పెట్టేవారు కాదు.

''ఇంటి బాధ్యతలేవీ పట్టించుకోకుండా దైవ భక్తిలో ఉండటమే అన్నిటికన్నా సుఖం'' అనిపించింది విశ్వకేతుడికి. అందువల్ల అతను దేవుడి పూజ పేరుతో బాధ్యతా రహితంగా ప్రవర్తించడం నేర్చుకున్నాడు. కాలక్రమేణా అతని తల్లిదండ్రులు పెద్ద వాళ్లయ్యారు. ధనగుప్తుడికి ఓపిక క్షీణించి, వ్యాపారం మానివేశాడు. అప్పుడు కూడా విశ్వకేతుడు ఇంటి బాధ్యతలు చూసు కోకుండా, గుళ్లూ గోపురాలు పట్టి తిరగ సాగాడు. ఇంటిపని భారమంతా, ముసలి వాడైన ఆ ఇంటి పనివాడు, రంగయ్యే చూసుకునేవాడు.

ధనగుప్తుడికి పక్షవాతం వచ్చి మంచంలో పడ్డాడు. వైద్యుడు అతడి కాలూ చెయ్యీ పావురాయి రక్తంతో మర్దన చెయ్యమని రంగయ్యకు చెప్పాడు. రోజూ పావురాయి రక్తం సేకరించి, దాంతో ధనగుప్తుకి రంగయ్యే మర్దన చేస్తుండేవాడు.

ఇదిలా ఉండగా ఆ ఊళ్లోని భక్త బృందా లన్నీ కలిసి కాశీయాత్ర తలపెట్టారు. విశ్వ కేతుడు అత్యుత్సాహంగా కాశీయాత్రలో పాల్గొనడానికి సిద్ధమయ్యాడు. కాశీలో ఉన్న పూర్ణానంద స్వామి, మనిషిని చూడగానే అతను స్వర్గానికి వెళతాడో, లేదో వెంటనే చెప్పేస్తాడట. తనలోని అపారమైన దైవభక్తి తనకు స్వర్గాన్ని సంప్రాప్తించి పెడుతుందని విశ్వకేతుడి విశ్వాసం. ఆ విషయం స్వామి

ఎ. పుష్పాంజలి

చెప్తే అందరూ తననింకా ఎక్కువ గౌరవిస్తారని అతని అభిప్రాయం.

అయితే ఇరుగుపొరుగువాళ్లు ''నాయనా విశ్వకేతూ! నీ తండ్రి చూస్తే నేడో రేపో అన్నట్టున్నాడు. నీ తల్లి వృద్ధురాలు. పనివాడు రంగయ్య కూడా వృద్ధుడే. కాబట్టి వీళ్లందర్నీ ఈ పరిస్థితిలో వదిలివేసి నువ్వెళ్లడం అంత మంచిది కాదు'' అని సలహా ఇచ్చారు. వాళ్ల మాటలు పెడచెవిన పెట్టిన విశ్వకేతుడు మూటా ముల్లె సర్దుకుని కాశీకి ప్రయాణమైనాడు.

కాశీ చేరాక కాశీ విశ్వనాథుని దర్శించకమునుపే వాళ్లు పూర్ణానందస్వామి దర్శనానికి వెళ్లారు.

తన ఆశ్రమంలో చెట్టుకింద ఉన్న విశాలమైన అరుగు మీద స్వామి ఆసీనులైయున్నారు. కళ్లు తెరిచి, తన ముందు చేతులు వేలాడ్చి నిలుచున్న విశ్వకేతుని తేరిపార చూసి, ఇలా అన్నాడు. ''నాయనా! స్వర్గానికి వెళతానో, నరకానికి వెళతానో తెలుసుకుందామన్న ఆసక్తితో నా ముందు నిలుచున్నావు. ఔనా? అయితే నువ్వెక్కడికి వెళతావని నీ అభిప్రాయం?'' అందుకు విశ్వకేతుడు గర్వంగా ''స్వామీ! చిన్ననాటి నుంచీ దైవభక్తి తప్ప మరే ధ్యాసా లేనివాణ్ణి. నేను ఖచ్చితంగా స్వర్గానికే పోతానని ఘంటా పథంగా చెప్పగలను'' అన్నాడు.

జవాబుగా స్వామి నవ్వి ''నాయనా, నీ నమ్మకం మెచ్చుకోదగ్గదే. అయితే నీ నుదుట రేఖలు మాత్రం నీకు స్వర్గప్రాప్తి లేదని చెబుతున్నాయి. కారణం, నువ్వు తల్లిదండ్రులను సేవించుకోక పోవడమే. జన్మనిచ్చిన తల్లిదండ్రులు దైవం కన్నా పవిత్రమైనవాళ్లు!'' అన్నాడు.

తన తప్పు తెలుసుకున్న విశ్వకేతుడు పూర్ణానందస్వామి పాదాలపై పడి విలపించాడు. అతను వెంటనే తన గ్రామానికి తిరిగి వచ్చి, తను చేయగలిగిన పనులన్నీ చేసి, ఆ డబ్బుతో తల్లిదండ్రులకు వైద్యం చేయించాడు. దినారాత్రులు వారికి శుశ్రూషలు చేశాడు. ఆ శుశ్రూషతో తండ్రి బాగా కోలుకున్నాడు.

మరెప్పుడూ విశ్వకేతుడు స్వర్గప్రాప్తి గురించి ఆలోచించనే లేదు.






# వీరనారి అనూరాధ

అభయ చక్రవర్తి అపూర్వనగరానికి అర్హమైన పాలకుడు. తన పాలన కింద రాజ్యం సిరి సంపదలతో తులతూగింది. ఎక్కడ చూసినా ప్రజల ముఖాల్లో సంతోషం, శాంతి.

అభయ చక్రవర్తికి అనిరుద్ధుడు అనే కుమారుడు, అనూరాధ అనే కుమార్తె ఉన్నారు. తండ్రికి లాగానే అనిరుద్ధుడు అసాధారణ మేధావి, గొప్ప యోధుడు కూడా. బాల్యంలోనే ఇతడు అనేక కళల్లో ఆరితేరాడు. అతడు గుర్రపు స్వారీ చేయడం, కత్తి యుద్ధంలో పాల్గొనడం చిన్న సోదరి అనూరాధ తరచుగా చూసేది. దీంతో ఆమెకు కూడా ఈ సాహస క్రీడల పట్ల మక్కువ ఏర్పడింది. సాధారణ ఆడపిల్లలకు మల్లే, ఆమెకు దుస్తులన్నా, ఆటబొమ్మలన్నా పెద్దగా ఆసక్తి ఉండేది కాదు. అనతి కాలంలోనే ఆమె రాజ్యంలోని వీరులు, శూరయోధులందరినీ పోటీలలో ఓడించి వేసింది. ఆమె పేరు రాజ్యమంతటా మారు మోగింది.

అపూర్వనగరంలో ప్రతి ఏటా గుర్రపు స్వారీ పోటీ జరిగేది. ఈ పోటీల్లో పురుషులకు మాత్రమే ప్రవేశం ఉండేది. యువరాణి అనూరాధకు కూడా ఈ పోటీలలో పాల్గొనాలని కోరిక పుట్టింది. అయితే ఈ పోటీలు ఆమె వంటి సుందరీమణులకు ఉద్దేశించినవి కావని నిర్వాహకులు సున్నితంగా తిరస్కరించారు.

వారి మాటలకు ఏమాత్రం చలించని అనూరాధ వెనుదిరిగి పురుషవేషంలో తిరిగొచ్చి పోటీల్లో పాల్గొన్నది. మారువేషంలో ఆమెను ఎవరూ గుర్తించలేకపోయారు. యువరాజు అనిరుద్ధుడికి, యువరాణి అనూరాధకు మధ్య తీవ్రంగా పోటీ జరిగింది. అయితే అంతిమంగా విజయం అనూరాధనే వరించింది. పురస్కారం అందుకోవడానికి తన తండ్రి అభయ మహారాజు వద్దకు వెళ్ళినప్పుడు అనుకోకుండా ఆమె తలపాగా నేలమీద పడిపోయింది. అందరూ ఆమెను గుర్తుపట్టారు. అది చూసి ఆశ్చర్యపోయిన తండ్రి ఆమెతో

నీలమ్ చంద్ర

అన్నాడు. ''నీ సోదరుడితో సహా సమర్థులైన పురుషులతో తీవ్రమైన పోటీలో నెగ్గినందుకు నిన్ను చూసి గర్విస్తున్నాను తల్లీ, కాని నీవు ఏ రకంగా చూసినా మహిళవు. త్వరలో నీకు వివాహం జరుగనుంది. కాబట్టి మరోసారి ఇలాంటి పోటీలలో పాల్గొనవద్దని నిన్ను కోరుతున్నాను.''

ఈ విషయం తెలిసి అనూరాధ విషాదంలో కూరుకుపోయింది. అయితే కుటుంబంలో పెద్దలు చెప్పిన మాటలను గౌరవించాలని ఆమె నేర్చుకుంది కాబట్టి అన్ని రకాల యుద్ధ కళలలో పాల్గొనడం ఆమె నిలిపివేసింది.

కొన్ని వారాల తర్వాత, అపూర్వ నగర శాంతియుత వాతావరణంలో ఉన్నట్లుండి కల్లోలం చెలరేగింది. ఈ రాజ్యంపై ఉన్న ట్లుండి రెండువైపుల నుంచీ ముట్టడి జరిగింది. ఉత్తర భాగాన పొరుగు రాజు శాశ్వతుడు తన సేనలను దింపాడు.

దక్షిణ భాగం నుంచి రాజు కీర్తిసేనుడు తన పటాలాన్ని మోహరించాడు. రాజు అభయుడు కోట ఉత్తర భాగ రక్షణ బాధ్యతలు చేపట్టాడు, దక్షిణ దిశలోని కోట రక్షణకు యువరాజు అనిరుద్ధుడి నేతృత్వంలో కొన్ని బలగాలు మోహరింపజేశాడు.

పొరుగురాజు శాశ్వతుడు ఒక వారంలోపే పరాజయం పొందాడు. మరోవైపున యువ రాజు అనిరుద్ధుడు కూడా గెలుపొందాడు. కానీ అనూహ్యమైన కుట్రతో కీర్తిసేనుడు యువరాజు అనిరుద్ధుడని బందీగా పట్టుకున్నాడు. అపూర్వనగర రాజ్యాన్ని తనకు స్వాధీనపరిస్తే అనిరుద్ధుడిని వదిలిపెడతానని అతడు అభయుడికి సమాచారం పంపాడు.

వార్త వినగానే అపూర్వ నగర రాజ్యం యావత్తూ అవమానంతో వేగిపోయింది. తమ




యువరాజు శత్రువు చేత చిక్కుతాడని వారు కలలో కూడా ఊహించలేదు. అలాగని కీర్తిసేనుడు తమను పాలించనున్నాడనే ఆలోచనను వారు భరించలేకపోయారు. అతడు అంత మొరటైన, క్రూరుడైన, అహంకార పాలకుడు మరి!

రాజు అభయుడు కూడా సందిగ్ధంలో పడ్డాడు. తన కుమారుడంటే అతడికి ఎంతో మక్కువ. తన రాజ్యంలోని ప్రజలు అతడిని కోరుకుంటున్నారు. ఈ రెండు ఇప్పుడు తన చేతిలో లేకుండా పోయాయి.

ఒక రోజు, అభయుడు సింహాసనం మీద కూర్చుని ఉండగా, అనూరాధ అతడి వద్దకు వచ్చింది. ఆమె తండ్రి పాదాల వద్ద కూర్చుని తండ్రి ఒడిలో తల పెట్టి అన్నది. ''తండ్రీ, నాకు ఒక ఆలోచన తట్టింది. నేను కత్తులతో, ఇతర ఆయుధాలతో ఆడుకోవడం మీకు నచ్చదని నాకు తెలుసు. కాని ఒకే ఒక్కసారి నాకు



డని కబురు తెలిసింది. విషయం వినగానే కీర్తిసేనుడు పెద్దగా నవ్వాడు. అభయుడిని అతడు ఘోరంగా దెబ్బ తీశాడు మరి.

తానిప్పుడు విశాల సామ్రాజ్యానికి పాలకుడిగా కాబోతున్నట్లు తనకు తెలుసు. స్వంత కుమారుడిని శత్రువుకు అప్పగించి ఎవరూ మూర్ఖులుగా ఉండలేరు. కీర్తిసేనుడు తక్షణమే దూతను పిలిపించాడు. ''మీ రాజు పంపిన సందేశం ఏమిటి?'' అని అడిగాడు.

దూత కీర్తిసేనుడికి ప్రణామం చేసి చెప్పాడు. ''ప్రభూ, మా మహారాజు తన సింహాసనం వదులుకోవడానికి అంగీకరిస్తూ మీకు ఈ సందేశం పంపాడు.''

దూత వేషంలో ఉన్న అనూరాధ ఈ మాటలంటూనే `మందిరాన్ని కలియజూసింది. సందేశం రాసి ఉన్న పట్టు వస్త్రం మధ్య భాగంలో ఆమె నేర్పుగా చిన్న కత్తిని దాచి ఉంచింది. తన కుడివైపున కూర్చుని ఉన్న అందమైన యువకుడు కీర్తిసేనుడి కుమారుడు, యువరాజు రాజసేనుడని ఆమె గ్రహించింది. కీర్తిసేనుడు, కొలువు తీరి ఉన్నవారు తమ ఘన విజయం గురించి ప్రశంసించుకుంటున్న సమయంలో ఆమె ఉన్నట్లుండి కత్తి బయటకు తీసి రాజసేనుడి ఆసనం వద్దకు చేరుకుంది.

అక్కడ ఏం జరుగుతూందో ఎవరూ ఊహించక ముందే, ఆమె కత్తిని రాజసేనుడి వైపు గురిపెట్టి హెచ్చరించింది. ''అనిరుద్ధుడిని ఇక్కడికి తీసుకురావలసిందిగా ఆదేశించండి, లేదంటే మీ కుమారుడిని హతమారుస్తాను.'' అన్నది.

ఊహించని పరిణామంతో సభలోని వారు నివ్వెరపోయారు. కాని ఇక వారు చేయగలిగిందేమీ లేదు. వారికి రాజసేనుడంటే ప్రాణం.

అవకాశం ఇవ్వమని అభ్యర్థిస్తున్నాను. నాకు నా సోదరుడిని వెనక్కు తెచ్చుకోవాలని ఉంది.''

రాజు అభయుడు ఆమెకేసి సందేహంగా చూశాడు. ఆమె వివరించింది, ''నేను పురుష వేషం ధరించి దూతలాగా రాజు కీర్తిసేనుడి వద్దకు వెళతాను. నా వెంట చిన్న కత్తిని మాత్రమే వెంట బెట్టుకు వెళతాను, దాంతో నా సోదరుడిని విడిపించి తీసుకువస్తాను.'' అభయుడు ఇప్పటికే అనిరుద్ధుడిని పోగొట్టుకున్నాడు.

తన ప్రియపుత్రికను కూడా కోల్పోవడం అతడికి సమ్మతం కాలేదు. అందుకే అతడామెకు అనుమతి నిరాకరించాడు. అయితే తండ్రి అంగీకరించేంత వరకు ఆమె అతడిపై ఒత్తిడి తీసుకువచ్చింది.

ఇలా ఉండగా, ఒకరోజు కీర్తి సేనుడి దర్శనార్థం అభయుడి దూత ఒకరు వేచి ఉన్నా

కాస్సేపటిలోనే అనిరుద్ధుడిని అక్కడికి తీసుకు వచ్చారు.

అనూరాధ సభను ఉద్దేశించి, ''నేను రాజసేనుడిని నా భద్రత రీత్యా తీసుకెళుతు న్నాను, మా రాజ్యం సరిహద్దులలో ప్రవే శించే వరకూ అతడు మాతోనే ఉంటాడు.'' అని చెప్పింది. ఎవరూ నోరెత్తే సాహసం చేయ లేదు. రాజసేనుడి గొంతుమీద కత్తి ఆనించి యువరాణి అనూరాధ, యువరాజు అనిరు ద్ధుడు అక్కడి నుంచి వెళ్లిపోయారు.

అనూరాధ తనతో రెండు గుర్రాలను వెంట తెచ్చింది ఒక గుర్రంపై అనిరుద్ధుడు, రాజ సేనుడు కూర్చున్నారు మరొక అశ్వంపై అనూ రాధ కూర్చుంది. కాస్సేపయ్యాక అనూరాధ తన తలపాగా తీసివేసింది. ఇంత అందమైన, సాహసిక యువతిని చూసిన రాజసేనుడు ఆశ్చర్య చకితుడయ్యాడు. ఆరాధనతో అతడు ఆమెను అభినందించాడు. ఆమెను వివాహం చేసుకుంటానని ప్రతిపాదించాడు. ఆమె సున్నితంగానే తిరస్కరిస్తూ, అది పెద్దలు నిర్ణయించవలసిన విషయమని చెప్పింది.

తమ రాజ్యం సరిహద్దులు సమీపించ గానే రాజసేనుడిని విముక్తుడిని చేసి అని రుద్ధుడు, అనూరాధ ప్రయాణం కొనసాగిం చారు. అనంతరం రాజసేనుడు కోటకు చేరు కున్నప్పటికీ అనూరాధను మర్చిపోవడం మాత్రం అతడికి శత్రురాజ కుమార్తె అయిన సాధ్యం కాలేదు. నిజంగానే అతడు ఆమెపట్ల అనురక్తిని పెంచుకున్నాడు.

తండ్రి కీర్తిసేనుడితో విషయం వివరించి ఆమె లేకుండా తను జీవించలేనని, ఆమెను వివాహమాడగోరుతున్నానని చెప్పాడు. కీర్తి సేనుడు కూడా వృద్ధాప్యంలోకి అడుగుపెట్టాడు. పైగా యుద్ధంలో ఓడిపోవడంతో తాను అవ లంబిస్తూ వచ్చిన మార్గం సరైంది కాదని గ్రహింపు కలిగింది.

హిమాలయాలకు తరలి వెళ్లి, తదుపరి జీవితాన్ని ధ్యానం చేస్తూ గడపాలని నిర్ణయిం చుకున్నాడు. అందుచేత, అతడు రాజసేనుడి ప్రతిపాదనకు సమ్మతించాడు. వెంటనే అభ యుడికి తన కూతురుని కన్యాదానం ఇవ్వవల సిందిగా సందేశం పంపుతూ అపూర్వనగరానికి అతడు దూతను పంపించాడు.

ఆ తర్వాత రాజసేనుడు, అనూరాధ రెండు రాజ్యాలను ఉమ్మడిగా చిరకాలం జనరంజ కంగా పాలించారు.





# వ్యక్తి వికాసం

త్రిధాముడనే ముని తన శిష్యుడు సౌశీల్యుడితో లోకసంచారం చేస్తూ రంగాపురం గ్రామం చేరుకున్నాడు. ఆ సమయంలో రచ్చబండ దగ్గర ఊళ్లో జనం పోగయి ఉన్నారు. గురుశిష్యులిద్దరూ అక్కడికి చేరుకున్నారు. ఒకనెయ్యి వర్తకుడు చుట్టుపక్కల గ్రామాల్లో కల్తీ నెయ్యి అమ్ముతూ ఎంతోమందిని అనారోగ్యం పాలు చేశాడనే అభియోగం రుజువు కావడంతో అతడిపై గ్రామ పెద్ద తీర్పు చెప్పి శిక్షను అమలు పరుస్తున్నాడు. తీర్పు ప్రకారం వ్యాపారికి మూడు రకాల శిక్షలు విధించి వాటిలో ఏదో ఒక శిక్షను ఎంచుకునే అవకాశం అతడికే ఇచ్చారు.

అతడికి విధించిన శిక్షలు ఏమిటంటే: అతడు అమ్ముతున్న కల్తీనెయ్యిని ఒకేసారి అయిదు సేర్లు తినాలి, లేదూ.. వంద కొరడా దెబ్బలు తినాలి. లేదా వంద వరహాలు జరిమానా చెల్లించాలి.

నేరస్థుడైన నెయ్యి వ్యాపారి మొదట అయిదు సేర్లనెయ్యిని తినే శిక్షను ఎంచుకుని, తినసాగాడు. అతి కష్టం మీద ఒక సేరు నెయ్యి లాగించిన వ్యాపారి, ఇక తన వల్ల కాదని రెండో శిక్షగా వంద కొరడా దెబ్బలు తినడానికి ఒప్పుకున్నాడు. అయితే పది కొరడా దెబ్బలు తినగానే ప్రాణం పోయినంత పనయింది. గత్యంతరం లేక మూడో శిక్షగా ఆ వ్యాపారి జేబులోంచి వంద వరహాలు తీసి జరిమానా చెల్లించి ఇంటి దారి పట్టాడు.

సౌశీల్యుడు గురువుతో ''ఏ శిక్ష విధించాలో నేరస్తుడినే కోరుకొమ్మని చెప్పిన గ్రామపెద్ద తీర్పు చాలా వింతగా ఉంది'' అన్నాడు.

దాసరి వెంకటరమణ

త్రిధాముడు నవ్వి, ''శిక్ష అనేది నేర స్థుడిలో ముందు పశ్చాత్తాపం కలిగించి, తరవాత, ఆ నేరాన్ని ప్రోత్సహించిన చెడు గుణాన్ని సమూలంగా తుడిచివేయగల గాలి. బుద్ధిమంతుడైన గ్రామపెద్ద ఆ పని సక్రమంగా చేశాడని నా అభిప్రాయం'' అన్నాడు.

సౌశీల్యుడు ఈ విషయమై తమ ప్రయాణంలో త్రిధాముడిని అనేక సందేహాలతో ప్రశ్నిస్తూ వచ్చాడు. ''ఎందుకింత ద్రోహచింతన? ఎందుకంత స్వార్థం? ఆ వ్యాపారి కల్తీ చేయడానికి బదులు వ్యాపారంలో తన కష్టానికి తగిన లాభం కలుపుకుని గిట్టుబాటు ధర చెప్పి వస్తువులు అమ్ముకోవచ్చు కదా!'' అన్నాడు.

త్రిధాముడు నవ్వి ''సుఖానికి అలవాటు పడుతున్న మనిషి కష్టపడకుండా సుఖపడే మార్గాలను అన్వేషిస్తున్నాడు, రాత్రికి రాత్రే కోటికి పడగలెత్తాలని అడ్డదారులు వెతుకుతున్నాడు.'' అన్నాడు

''దీనికి కారణం ఏమిటి? ఈ పరిణామానికి బాధ్యులెవరు?'' సౌశీల్యుడు కుతూహలంగా అడిగాడు.

''ఒకడు తనకు తోచిన రీతిలో మరొకడిని మోసం చేస్తాడు. దాన్ని గుర్తించిన వాడు వాడిని నిలదీయడం పోయి, మరొకడిని మోసం చేస్తున్నాడు. మోసం అనేది చాలీ చాలని దుప్పటి. ముఖం కప్పుకుంటే కాళ్లు, కాళ్లు కప్పుకుంటే ముఖం కనబడతాయి. ఇలా మోసం అనేది బహిరంగ రహస్యమైపోయి మోసం చేయడం సర్వసాధారణమైపోయింది'' అన్నాడు. త్రిధాముడు.




''ఈ రుగ్మత బారి నుండి మనిషిని కాపాడే మార్గమే లేదా?'' అని శిష్యుడాడిన మాటకు, త్రిధాముడు ''ఉంది, సందర్భం వచ్చినప్పుడు విపులంగా చెబుతాను'' అన్నాడు.

కొంత కాలం తర్వాత గురుశిష్యులిద్దరూ తమ ప్రయాణంలో భాగంగా ఒక ఊరు చేరి, ఊరి చివరన ఉన్న చింత తోపులో విశ్రమించారు. ఆ పక్కనే ఒక పాఠశాల. ఒక ఉపాధ్యాయుడు విద్యార్థులను చెట్లకింద కూర్చోబెట్టి వాళ్లకు గణితం బోధిస్తున్నాడు.

''ఒక పాల వ్యాపారి గ్రామంలో ఒక సేరు పాలను నాలుగు వరహాలకు కొని నగరానికి తీసుకుపోయి సేరు ఆరు

వరహాల చొప్పున అమ్మితే ఎంత లాభం వస్తుంది?''

''సేరుకు రెండు వరహాల లాభం'' రెండు క్షణాల్లో పిల్లలు ముక్త కంఠంతో చెప్పారు. ''ఆ లెక్కన, వ్యాపారి గ్రామంలో పది సేర్ల పాలను కొని, అందులో నాలుగు సేర్ల నీళ్లను కలిపి అమ్మితే ఎంత లాభం వస్తుంది?'' ఉపాధ్యాయుడు మళ్లీ అడిగాడు. పిల్లలు ఆ లెక్క చేయడానికి ఆలోచనలో పడ్డారు.

త్రిధాముడు సౌశీల్యుడి వంక చూస్తూ, ''ఈ పిల్లలు రేపటి ప్రపంచానికి వారసులు. రేపు తమ తోటి వాడిని ఎలా మోసం చేయాలో తరగతి గదిలో బహిరంగంగా నేర్చుకుంటున్నారు. నాలుగు వరహాల పాలను ఆరు వరహాలకు అమ్మితే రెండు వరహాల లాభం. ఇంతవరకు బాగానేఉంది కాని, అందులో నీళ్లు కలిపి అమ్మితే ఎంత లాభం వస్తుందనే ప్రశ్నతో పిల్లవాడి మనసు మరింత వేగంగా ఆలోచించి పదును దేరుతుందేమో గానీ, పాలల్లో నీళ్లు కలిపి అమ్మొచ్చు అనే తప్పుడు ఆలోచనను వాడిలో చొప్పిస్తున్నాం. పసితనంలో గ్రహణ శక్తి ఎక్కువగా ఉండే పిల్లలు ఏదైనా వెంటనే నేర్చేసుకుంటారు. పెద్దలనుంచి పిల్లలు అవసరానికి అబద్దాలాడటం నేర్చుకుంటారు. ఇంటా బయటా చివరికి బడిలో కూడా మోసమే నేర్చుకుంటున్నారు. రేపటి తరానికి ఆరోగ్యంతో కూడిన బీజాలను అందించడం లేదు. దీన్ని మార్చాలంటే మనిషి ఆలోచనా విధానంలో మార్పు రావాలి. ముందు మన విద్యావిధానంలో సమూల మార్పు జరగాలి'' అన్నాడు.

''మనం రాజ్యాన్నేలే రాజుగారిని కలిసి పిల్లల మనసుల్లో కలుషిత ఆలోచనలను రేకెత్తించే ఇలాంటి పాఠ్యాంశాలను గుర్తించి తొలిగించవలసిందిగా మనవి చేద్దాం.'' అన్నాడు సౌశీల్యుడు ఆవేశంగా.

త్రిధాముడు నవ్వి, ''అలాగే... ఈ ఉద్యమం నీతోనే ఎందుకు మొదలు కాకూడదు? రేపే రాజధాని మలయావతీ నగరం బయలుదేరుదాం.'' అన్నాడు.



# కెరీర్ అంటే?



నిన్నటి దినం నేను భోంచేయడానికి ఫైవ్ స్టార్ హోటల్‌కి వెళ్లాను. అక్కడ పలు విభాగాల్లో చాలామంది పనిచేస్తూ ఉండటం గమనించాను. తర్వాత మా కౌన్సిలర్ వద్దకు వెళ్లినప్పుడు ఆమె, హోటల్ మేనేజ్ మెంట్‌లో అందుబాటులో ఉన్న అవకాశాలను వివరంగా తెలిపారు:

1. కేటరింగ్ మేనేజ్‌మెంట్‌లో బెవరేజ్ మేనేజర్, బాంక్వెట్ మేనేజర్, రెస్టారెంట్ మేనేజర్, ఆహారం, సేవల మేనేజర్ వగైరా ఉంటారు.
2. కేటరింగ్ కార్యకలాపాలు: వంట విభాగం, స్టీవార్డ్ విభాగం, ఆహార వడ్డన విభాగం.
3. ఫ్రంట్ ఆఫీస్ విభాగం: ఫ్రంట్ ఆఫీస్ మేనేజర్, రిసెప్షనిస్టులు, సమాచార సహాయకుడు, బెల్ బాయ్ వంటి వారు.
4. హౌస్ కీపింగ్ విభాగం: ఫ్లోర్ సూపర్‌విజన్, రూమ్ మేనేజర్, హౌస్ కీపర్.
5. ఎ/సిలు/మార్కెటింగ్/ఇఎన్జీ/హెచ్.ఆర్ మరియు పర్సనల్ విభాగాలు.

ఎన్‌సిహెచ్ఎమ్‌సిటి ప్రతిపాదిస్తున్న కోర్సుల కోసం, ఉమ్మడి ప్రవేశ పరీక్ష ద్వారా అడ్మిషన్ జరుగుతుంది. గ్రూప్ చర్చలు, ఇంటర్వ్యూ తర్వాత చివరి ఎంపిక జరుగుతుంది. జెఈఈ మీ సామర్థ్యాన్ని ఇలా పరీక్షిస్తాడు: 1. రీజనింగ్ మరియు తార్కిక సామర్థ్యత 2. న్యూమెరికల్ ఎబిలిటీ మరియు శాస్త్రీయ వైఖరి 3. లోకజ్ఞానం 4. ఇంగ్లీష్ భాష.

**అర్హత:**

- +2తో పాటు హోటల్‌మేనేజ్‌మెంట్‌లో 3 ఏళ్ల డిగ్రీతో తప్పనిసరిగా ఇంగ్లీష్ చదివి ఉండాలి. లేదా హోటల్‌మేనేజ్‌మెంట్ లో 2 సంవత్సరాల పోస్ట్ గ్రాడ్యుయేట్ డిగ్రీ కోసం ఏ సబ్జెక్టులో అయినా గ్రాడ్యుయేషన్ ఉండాలి.
- 3 నెలల నుంచి సంవత్సరం వరకు సర్టిఫికెట్ కోర్సులకోసం ఎస్.ఎస్.ఎల్.సి పూర్తి చేసి ఉండాలి.
- హోటల్‌మేనేజ్‌మెంట్ మరియు పోస్ట్ గ్రాడ్యుయేట్ డిప్లొమా కోర్సు కోసం ప్లస్ టూ నుంచి డిగ్రీ వరకు చదివి ఉండాలి.
- బి.ఎస్‌సి కేటరింగ్ టెక్నాలజీ - మేనేజ్‌మెంట్ - తమిళనాడులో మాత్రమే:+2 వ్యవధి 3 ఏళ్లు.



వచ్చే నెలలో, మీకు ఈ కోర్సులను ప్రతిపాదిస్తున్న సంస్థలను మీకు తెలియజేస్తాను.

- సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 24

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. **250**లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు **50** రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ **- 24** అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. జనవరి నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. మార్చ్ 2011 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## సౌరవ్యవస్థ విశేషాలు




1. సౌర వ్యవస్థలో ఎన్ని గ్రహాలు ఉన్నాయి?
2. సౌరవ్యవస్థలో అతి పెద్ద గ్రహం ఏది?
3. మన సౌర వ్యవస్థలో కేంద్ర మరియు అతి పెద్ద విభాగం ఏది?
4. సూర్యుడికి అతి దగ్గరగా ఉన్న గ్రహం ఏది?
5. అరుణ గ్రహంగా దేన్ని పిలిచారు?
6. తోకచుక్క అంటే ఏమిటి?
7. సౌర వ్యవస్థలో అతి పెద్ద అగ్నిపర్వతం పేరు చెప్పండి.
8. అంగారక గ్రహంలో ఒక సంవత్సరం అంటే భూమిపై రెండు సంవత్సరాల కంటే ఎక్కువ కాలం - ఒప్పు లేదా తప్పు.

## చందమామ లోకజ్ఞానం క్విజ్-22 నవంబర్ 2010 సమాధానాలు

1. 1939 మరియు 1945 2. బ్లిట్జ్‌క్రీగ్, అంటే 'మెరుపు యుద్ధం'' అని అర్థం
3. యుఎస్ఎస్ఆర్ 13.6 మిలియన్లమంది సైనికులను కోల్పోయింది.
4. ముస్సోలిని 5. చైనా, గ్రేట్ బ్రిటన్, సోవియట్ యూనియన్, యుఎస్ఏ

నవంబర్ నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.



# నవ్వుల పువ్వులు




డాక్టర్ : ''నాకు ఎన్ని వేళ్లు ఉన్నాయో చెప్పు''
రామ్ : ''ఆరు వేళ్లు''
డాక్టర్ : ''ఏది ఘోరంగా ఉందో నాకు అర్థం కావటం లేదు. మీ కంటి చూపా లేదా లెక్కలా?''



రెండు ఆవులు మైదానంలో నిలబడి ఉన్నాయి. ఒకటి రెండోదానితో చెబుతోంది. ''మ్యాడ్ కౌ వ్యాధి గురించి నువ్వు భయపడుతున్నావా?''

మరొకటి చెప్పింది. ''లేదు. అది నన్నేమీ భయపెట్టలేదు. నేను గుర్రాన్ని.''



సంజయ్ : ''అంటే మీ ఇంటికి పక్కనున్న కుటుంబంతో నీకు సన్నిహిత సంబంధం ఉందన్నమాట. కాదా?''
విజయ్ : ''అవును ఆ ఇంటి కుక్క రాక్సీ మా కుక్క తమ్ముడే.''



నా స్నేహితురాలికి గోళ్లు కొరుక్కునే అలవాటు ఉంది. దీన్ని మానివేయాలని ఆమె యోగా చేయడం మొదలెట్టింది. త్వరలోనే ఆమె గోళ్లు మామూలుగా అయాయి. యోగా ఆమె సమస్యను పూర్తిగా పరిష్కరించిందా అని నేనడిగాను.

''లేదు,'' చెప్పిందామె. ''ఇప్పుడు నేను నా కాలిగోర్లు అందుకోగలను. కాబట్టి నేను వాటిని కొరుకుతున్నాను.''

# సుడోకు పజిల్

కింది రెండు సుడోకు పజిల్స్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాల్లను మాకు పంపించండి. ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్స్‌కు పరిష్కారాలు మార్చ్ 2011 సంచికలో ప్రచురించబడతాయి. సరైన సమాధానాలు పంపిన విజేతల్లో ఒక్కరికి రూ.500 బహుమతి ఉంటుంది.

పజిల్ – 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | 3 | | | 7 | | 9 |
| 5 | | | | | 9 | | | |
| | | 8 | | | | | | 4 |
| | | 3 | | | 6 | | | |
| | | 1 | | 5 | | | | 8 |
| | 5 | | | | 8 | | | 1 |
| | | 7 | | 6 | | 1 | | |
| | 8 | | 5 | | | 9 | 7 | |
| 9 | | | | | 3 | | 4 | 2 |

పజిల్ – 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 3 | 7 | | 1 | | | | 8 |
| | 6 | | 7 | | 8 | | | 3 |
| 9 | | | | | | | | |
| | 5 | | | 8 | | | | 6 |
| 6 | | | | | | | | 9 |
| 4 | | | | 3 | | | 5 | |
| | | | | | | | | 1 |
| 3 | | | 1 | | 4 | | 8 | |
| 5 | | | | 2 | | 6 | 4 | |

మీ ఎంట్రీలను 2010 జనవరి 25వ తేదీలోగా పంపించండి. పంపవలసిన చిరునామా:

**SUDOKU PUZZLE, CHANDAMAMA INDIA LTD.,**

Plot No.2, Swathi Enclave Nos. 5 & 6, Amman Koil Street, Vadapalani, Chennai-600026. e-mail your entries to:contests@chandamama.com

---

నవంబర్ 10 సుడోకు పజిల్స్‌కు సరైన పరిష్కారాలు:

పజిల్ – 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 2 | 8 | 3 | 7 | 9 | 6 | 1 | 5 | 4 |
| 4 | 6 | 5 | 1 | 8 | 2 | 3 | 7 | 9 |
| 7 | 1 | 9 | 3 | 5 | 4 | 6 | 2 | 8 |
| 8 | 9 | 6 | 5 | 1 | 7 | 4 | 3 | 2 |
| 5 | 4 | 1 | 2 | 3 | 8 | 9 | 6 | 7 |
| 3 | 2 | 7 | 4 | 6 | 9 | 8 | 1 | 5 |
| 1 | 5 | 4 | 8 | 7 | 3 | 2 | 9 | 6 |
| 6 | 3 | 2 | 9 | 4 | 5 | 7 | 8 | 1 |
| 9 | 7 | 8 | 6 | 2 | 1 | 5 | 4 | 3 |

Nov'10 Winners

B. Babanrao
Kolhapur-416012,
Ramila Basal
Rajasthan-305601,
W. Leyo
Kanya Kumari-629808,
A. Balaji
Nellore-524411.

పజిల్ – 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 2 | 6 | 3 | 8 | 5 | 7 | 9 | 1 | 4 |
| 1 | 5 | 7 | 4 | 2 | 9 | 8 | 6 | 3 |
| 9 | 8 | 4 | 6 | 3 | 1 | 7 | 2 | 5 |
| 3 | 1 | 6 | 9 | 4 | 8 | 5 | 7 | 2 |
| 7 | 4 | 9 | 2 | 6 | 5 | 3 | 8 | 1 |
| 5 | 2 | 8 | 7 | 1 | 3 | 4 | 9 | 6 |
| 4 | 9 | 1 | 3 | 7 | 6 | 2 | 5 | 8 |
| 6 | 7 | 2 | 5 | 8 | 4 | 1 | 3 | 9 |
| 8 | 3 | 5 | 1 | 9 | 2 | 6 | 4 | 7 |

# తిరిగే సీసా

ఈ తేలికపాటి ప్రయోగం న్యూటన్ 3వ గమనసూత్రాన్ని ప్రదర్శిస్తుంది.



ఏమేం కావాలి?

- 500 ఎంఎల్ ప్లాస్టిక్ నీళ్ల సీసా, మందపాటి స్ట్రా, దారం, ఎమ్-సీల్ (లేదా గోధుమ పిండి ముద్ద) జత కత్తెరలు, సూది.

తయారు చేయడం ఎలా?



- ప్లాస్టిక్ సీసా మూత దగ్గర పెద్ద సూదితో రంధ్రం చేయండి. ఈ రంధ్రం గుండా 8 సెంటీమీటర్ల పొడవైన దారాన్ని దూర్చి దాని వెలుపలి కొసను ముడి వేయండి. ఈ లూప్‌కి పొడవాటి దారాన్ని ముడివేయండి.
- పెద్ద మేకుతో సీసా అడుగు భాగం సమీపంలో రంధ్రం చేయండి. అవతల కొసన మరొక రంధ్రం చేయండి.





- ఒక్కోటి మూడు సెంటీమీటర్ల పొడవుండే రెండు మందపాటి ప్లాస్టిక్ స్ట్రా ముక్కలను (పాత జెల్ పెన్ రీపిల్లు చాలు) తీసుకోండి. వీటి ఒక కొసను ఏటవాలుగా కోయండి. చిత్రంలో చూపించిన విధంగా వీటిని రంధ్రాల్లోకి చొప్పించండి.



- కారిపోకుండా రంధ్రాల వద్ద ఎమ్-సీల్‌ను (లేదా ముద్దగా చేసిన పిండి) అంటించండి.
- ఇప్పుడు సీసాలో నీళ్లు నింపి దాన్ని దారంతో వేలాడదీయండి. రెండు నీటి జెట్‌లు సీసాని అటూ ఇటూ వేగంగా తిప్పుతాయి.

కాన్సెప్ట్: ఈ ప్రయోగం న్యూటన్ 3వ చలన సూత్రాన్ని ప్రదర్శిస్తుంది. ప్రతి చర్యా దానికి సమానమైన ప్రతిచర్యను కలిగి ఉంటుందని న్యూటన్ సూత్రం చెబుతుంది. నీళ్లు పోయడం చర్య. సీసా వ్యతిరేక దిశలో తిరగడం అనేది ప్రతి చర్య.

*రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ - యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)*



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.






| English | Which way do I go? | What is this road's name? |
|---|---|---|
| Telugu | నేను ఏ దారిలో వెళ్లాలి? | ఈ రోడ్డు పేరేమి? |
| Hindi | मैं किस रास्ते जाऊँ?<br>మైన్ కిస్ రాస్తే జావూన్? | इस सड़क का नाम क्या है?<br>ఇస్ సడక్ కా నామ్ క్యా హై? |
| Tamil | எந்த வழியில் நான் செல்கிறேன்?<br>ఎంద వళియల్ నాన్ సెల్‌గిరేన్? | இந்த சாலையின் பெயர் என்ன?<br>ఇంద శాలయిన్ పేర్ ఎన్నా? |
| Bengali | আমি কোন রাস্তায় যাবো?<br>ఆమి కోన్ రాస్తాయ్ జాబో? | এই রাস্তাটার নাম কী?<br>ఇ రాస్తా తార్ నామ్ కి? |
| Marathi | मी कोणत्या रस्त्याने जाऊ ?<br>మి కోంట్యా రాస్త్యానె జావూ? | या रस्त्याचं नाव काय आहे?<br>యా రాస్తియాచం నావ్ కాయ్ ఆహె? |
| Kannada | ನಾನು ಯಾವ ದಿಕ್ಕಿಗೆ ಹೋಗಬೇಕು?<br>నాను యావ దిక్కిగె హోగబేకు? | ಈ ರಸ್ತೆಯ ಹೆಸರು ಏನು?<br>ఈ రస్తెయ హెసరు ఏను? |
| Oriya | ମୁଁ କେଉଁ ରାସ୍ତାରେ ଯିବି?<br>మున్ క్యూన్ రాస్తారె జిబి? | ଏହି ରାସ୍ତାର ନାମ କଣ?<br>ఎహి రాస్తారా నామ కణా? |
| Gujarati | હું કયા રસ્તે જઉં?<br>హుం కయా రాస్తే జావన్? | આ રસ્તાનું નામ શું છે?<br>ఆ రాస్తాను నామ్ షన్ ఛె? |
| Assamese | মই কোন ফালে যাম?<br>ఓయి కోన ఫేల్ జామ్? | এই ৰাস্তাটোৰ নাম কি?<br>ఈ రాస్తాతోర్ నామ్ కి? |
| Malayalam | ഞാൻ ഏത് വഴിക്ക് പോകണം?<br>ఇంజాన్ ఏథు వళిక్కు పోకనమ్. | റോഡിന്റെ പേരെന്ത്?<br>రోడింటె పెరెంతు |
| Santali | ᱚᱠᱟ ᱦᱚᱨᱴᱤᱧ ᱥᱮᱱᱚᱜ-ᱟ?<br>ఒక హోర్టింజ్ సెనోగ్-ఆ? | ᱱᱚᱣᱟ ᱦᱚᱨ ᱨᱮᱱᱟᱜ ᱧᱩᱛᱩᱢ ᱪᱮᱫ?<br>నోవ బోర్ రెనాగ్ నుటుమ్ చెడ్? |
| Sanskrit | केन मार्गेण अहं गच्छामि ?<br>కెన్ మార్గేన అహమ్ గచ్ఛామి? | अस्य मार्गस्य नाम किम् ?<br>అస్య మార్గస్య నామ్ కిమ్? |





| English | I need to reach fast. | How long will it take? |
|---|---|---|
| Telugu | నేను వేగంగా చేరుకోవలసి ఉంది. | దీనికి ఎంత సమయం పడుతుంది. |
| Hindi | मुझे जल्दी पहुँचना है।<br>ముఝె జాల్దీ పహుంచ్‌నా హై. | कितना समय लगेगा?<br>కితనా సమయ్ లగేగా? |
| Tamil | எனக்கு விரைவாகச் செல்ல வேண்டும்?<br>ఎనక్కు విరైవాగ సెల్ల వేండుమ్? | எவ்வளவு நேரம் ஆகும்?<br>ఎవళవు నేరమ్ ఆగుమ్? |
| Bengali | আমায় তাড়াতাড়ি পৌঁছতে হবে।<br>అమయ్ తారతారీ పౌచోదె హోబీ | এটা কতক্ষণ লাগবে?<br>ఎతా కోతోక్షాన్ లాగ్‌బీ? |
| Marathi | मला लवकर पोहोचलं पाहिजे.<br>మల లవ్కార్ పోహోచల్ పహి జె | अजून किती वेळ लागेल?<br>అజూన్ కిటి వెల్ లగేల్? |
| Kannada | ನಾನು ಅತಿ ಬೇಗನೇ ತಲುಪಬೇಕಾಗಿದೆ.<br>నాను అతి బేగనే తలుపబెకాగిదె | ಇದಕ್ಕೆ ಎಷ್ಟು ಸಮಯ ಬೇಕಾಗುತ್ತದೆ?<br>ఇదక్కె ఎష్టు సమయ బేకాగుత్తదె? |
| Oriya | ମୁଁ ଶିଘ୍ର ପହଂଚିବାକୁ ଚାହେଁ।<br>మున్ షిఘ్రా పహంచిబాకు కాహెన్ | ଏଥି ପାଇଁ କେତେ ସମୟ ଲାଗିବ?<br>ఎథి పాయిన్ కెటె సమయ్ లాగిబా? |
| Gujarati | તમને પાણી જોઈએ છે?<br>మేరె జల్‌డీ పహోంచవు ఛె | દડો મારી તરફ ફેંકો.<br>తెమా కెతాలే వార్ లాగ్షే? |
| Assamese | মই সোনকালে পাবগৈ লাগে।<br>మయి ఝొంకాలె పాబకోయ్ లాజ్ | যাওঁতে কিমান সময় ল'ব?<br>జావటె కిమాన్ జోమోట్ లోబో? |
| Malayalam | എനിക്ക് വേഗത്തിൽ എത്തണം<br>ఎనిక్కు వేగత్తిల్ ఎథ్థాణమ్ | എത്ര സമയം എടുക്കും?<br>ఎత్రా సమయం ఎడుక్కుమ్? |
| Santali | ᱤᱧ ᱞᱚᱜᱚᱱ ᱥᱮᱴᱮᱨᱚᱜ ᱞᱟᱹᱠᱛᱤ।<br>ఇంజి లోగోన్ సెటెరోగ్ ల్యాక్టి | ᱴᱤᱱᱟᱹᱜ ᱥᱟᱹᱜᱤᱧ ᱦᱩᱭᱩᱜ-ᱟ?<br>టినాంగ్ సాగింజ్ హుయుగ్-అ? |
| Sanskrit | मया शीघ्रं गन्तव्यम् ।<br>మయా శీఘ్రమ్ గంతవ్యమ్ | कियान् समय: अपेक्षित: ?<br>కియాన్ సమయః అపేక్షితః? |

# భాన్‌గర్‌లో దెయ్యాలు



దెయ్యాలు ఉన్నాయో లేదో ఖచ్చితంగా తెలీదు. కాని, రాజస్థాన్ లోని భాన్‌గర్ ప్రాంత ప్రజలు పొద్దు కుంకిన తర్వాత ఆ చోటుకి వెళ్లే సాహసం మాత్రం చేయరు. ఆ చోటులో మధ్యయుగాలకు సంబంధించిన పలు శిధిలాలు ఉంటాయి

పైగా, ఇది పిశాచాలకు నిలయంగా కూడా ఉంటుందని నమ్మిక.

ఒక పురాణ గాథ ప్రకారం, భాంగార్ రాజుకుమారి అతిలోక సుందరి. ఆమెను చెరపట్టాలని ఒక తాంత్రికుడు భావించాడు. ఎడతెగని ప్రయత్నంలో రాజకుమారిని చేజిక్కించుకోలేకపోయిన తాంత్రికుడు ఆమెను చావవలసిందిగా శాపం పెట్టడమే కాకుండా, భాంగార్ నగరాన్ని ఉనికిలో లేకుండా పోవాలని శపించాడు. ఈ ప్రాంతం మొత్తంగా శిధిలమైపోవడానికి ఇదే కారణమని ప్రజలు నమ్ముతుంటారు కాని దీని వెనుక మార్మికత్వానికి ఆధారాలు మాత్రం చూపలేరు.

# ఉరలి కురుమలు

ఉరలికురుమ అనేవారు, అత్యంత వైవిధ్య భరితమైన చిత్రవర్ణాలు కలిగిన గిరిజన ప్రజలు. వీరు కేరళ లోని వయన్ ప్రాంతంలో కనుగొనబడిన అరుదైన గిరిజన తెగకు చెందినవారు.

మైసూరు జిల్లా సరిహద్దు ప్రాంతంలోని గిరిజనులు కన్నడ మాట్లాడతారు, కాగా వయనాడ్ ప్రాంతంలోని వారు కన్నడ, మలయాళ భాషలను కలిపి మాట్లాడుతుంటారు. వీరు తమ తెగలోని వారినే పెళ్లాడతారు. వీరు బెట్టు చిక్కమ్మ మరియు బమడు దేవతలను, పూర్వీకుల ఆత్మలను కొలుస్తుంటారు. తమలో మంచివారు దేవుళ్లు అవుతారని చెడ్డవారు దెయ్యాలు అవుతారని వీరి నమ్మకం.



ఈ తెగ చాలా నైపుణ్యం గల తెగ. వెదురు నుంచి బుట్టలను, చాపలను అల్లడం వీరికి వెన్నతో పెట్టిన విద్య.

# వింత గుర్రం

1



ఒకరోజు, తెనాలి రామలింగడి కోసం రాయలు కబురు పంపాడు. ''రఘుకు ఒక సందేశం తీసుకుపోవలసి ఉంది.'' రామ: ''ఆ క్రూర భూస్వామి వద్దకా? వెళతాను ప్రభూ.''

2



రామలింగడు తన గుర్రంపై స్వారీ మీద వెళుతున్నాడు. చలికాలం. మంచు కురుస్తోంది. కొండప్రాంతంలో ఉన్న రఘు నివాసాన్ని చేరుకునేసరికి రామలింగడు అలసిపోయాడు. పైగా ఆకలేస్తోంది.

3



రామలింగడు నిప్పుల పొయ్యి వద్ద కూర్చుని తీపిపదార్థాలు, మురబ్బాలు ఆరగిస్తున్న రఘును చూశాడు. ''లోపలకు రావచ్చాండీ? బయట బాగా చలేస్తోంది.''

4



రఘు, రామలింగడి పట్ల అమర్యాద ప్రదర్శించాడు. తర్వాత రామలింగడు తన గుర్రానికి ఒక మురబ్బాను ఇవ్వమని అడిగాడు. రఘు ఆశ్చర్యపోయాడు. అతడిమాటను నమ్మలేదు.

5



''గుర్రం తప్పకుండా తింటుంది. కావాలంటే మీరే దానికి మురబ్బాను పెట్టండి.'' అని రామలింగడు చెప్పాడు. ''సరే, నేనే వెళ్లి ఈ విషయం తేల్చుకుంటా.'' అన్నాడు రఘు.

6



అయితే రఘు ఎంత బలవంతపెట్టినప్పటికీ, మురబ్బాను తినడానికి గుర్రం మొరాయించింది.




ఈలోగా రామలింగడు రఘు స్థానంలో కూర్చుని తీపి మిఠాయి, ఫలహారాలు లాగించాడు. ''ఎంత బాగున్నాయో. ప్రాణం లేచివచ్చినట్లుంది నాకు.''




''నీ గుర్రం మురబ్బాను తినలేదు'' చెప్పాడు రఘు. రామలింగడు బదులుగా, ''తన యజమాని ఆకలి ఇప్పుడు తీరింది కనుక అది ఇప్పుడు గడ్డీ గాదంతోటే తృప్తిపడుతుంది లెండి!'' అన్నాడు.




''నీవు చాలా తెలివైన వాడివి. ముందే జాగ్రత్త పడవలసింది.'' అన్నాడు రఘు. ''సరే. నన్ను వెళ్లనివ్వండి. మళ్లీ మిమ్మల్ని ఆస్థానంలోనే కలుసుకుంటా.'' అని బదులిచ్చాడు రామలింగడు.

## హాస్య చిత్రం









# భిన్న ప్రాంతాల వస్త్రధారణ

దేశంలోని వివిధ రాష్ట్రాల ప్రజల కట్టుబొట్లుపై ఆల్బమ్


















83




HERCULES
MTB TURBODRIVE
RIDE YOUR PASSION
WHERE THE ROAD ENDS, A JOURNEY BEGINS.
Embark on a new adventure every time you get on the Fusion SS. Stylish looks with a flawless performance to match, this cycle is designed to complement your inner spirit.
www.ticyclesindia.com
FUSION

